# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి 4 | నవంబరు, 1959 | సంచిక 1

అగ్రహాయన, శకము—1881

## విషయ సూచిక



చందా వివరాలు :

సంవత్సరానికి . . . 2 రూపాయల 16 నయాపైసలు

విడిప్రతి వెల . 18 నయాపైసలు,

Edited and Published by the Director of Information and Public Relations, H,
Printed at Vir Milap Press, Mukaramjahi Road, Hyderabad



ట్టన దీపమే'' ఈ మాటలతో ప్రధాన మంత్రిని ముగ్ధులను చేసిన శ్రీ బత్తుల రామయ్య
తాలూకా). ఇతడు మద్రాసు జి. డంకర్లీ అండ్ కంపెనీ (ప్రైవేటు) లిమిటెడ్‌లో
మేస్త్రీగా పని చేస్తున్నాడు. వయస్సు 52 సంవత్సరాలు.

# ఐక్యత, సుహృద్భావాలు పెంపొందాలి

ఆంధ్రప్రదేశ్ అవతరణ తృతీయ వార్షికోత్సవం సందర్భంలో రాష్ట్ర గవర్నరు శ్రీ భీమసేన సచార్ 'ఆంధ్రప్రదేశ్'కి దిగువ సందేశం యిచ్చారు:

1959 నవంబరు 1వ తేదీకి ఆంధ్రప్రదేశ్ యేర్పడి మూడు సంవత్సరాలు నిండుతుంది. ఈ రోజు మనకు పండుగ. ఈ శుభ సమయంలో తోటి పౌరులయిన ప్రజానీకానికి అభినందనలను, హృదయ పూర్వకమయిన శుభాకాంక్షలను అందజేస్తున్నాను.

ఇటువంటి సమయాలలో మనం సాధించిన పనులను మననం చేసుకొనడం సహజం. సుమారు రెండు సంవత్సరాలుగా యీ రాష్ట్ర ప్రభుత్వ కార్యకలాపాలతో సంబంధం కలిగివుండే భాగ్యం నాకు లభించింది. యేమి సాధించామని వెనుకకు తిరిగి చూసుకున్నప్పుడు న్యాయంగా గర్వించదగిన ఫలితాలనే మనం సాధించామని నేను గట్టిగా చెప్పగలను. మనం తగినన్ని అద్భుతమయిన ఫలితాలను సాధించాం. కాబట్టి మనం న్యాయంగా మన రాష్ట్ర భవిష్యత్తు ఆశాజనకంగా వుండగలదని భావించవచ్చు.

రూ. 91 కోట్ల నాగార్జునసాగర్ బహుళార్థసాధక ప్రాజెక్టు అభివృద్ధి నిర్ణీత కార్యక్రమాన్ని మించి సాగుతున్నది. పెద్ద, మధ్యరకం, చిన్నరకం నీటి పారుదల ప్రాజెక్టులు అమలు జరుగుతున్నవి లేదా ప్రారంభానికి సిద్ధంగా వున్నవి. తుంగభద్ర యెగువ కాలువ, ఎగువ సీలేరు జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల విషయంలో వరుసగా మైసూరు, ఒరిస్సా ప్రభుత్వాలతో ఒప్పందాలు చేసుకోబడినవి. కేంద్ర ప్రభుత్వం ఆమోదంతో త్వరలో కొత్తగూడెంలో రసాయన యెరువుల ఫ్యాక్టరీ ఒకటి నిర్మించబడుతుంది. ఇందువల్ల రాష్ట్రంలో ఆహారోత్పత్తి హెచ్చుదలకు రసాయన యెరువులు విరివిగా లభించగలవు. సింగరేణి బొగ్గు గనులలో బొగ్గు వుత్పత్తి దాదాపు రెట్టింపు పెరిగింది. ద్వితీయ ప్రణాళిక లక్ష్యం 30 లక్షల టన్నులను చేరుకోడానికి అది యింకా క్రమేణా హెచ్చుతున్నది. శాస్త్రీయ వ్యవసాయ పద్ధతులవల్లనేమి, రైతులకు హెచ్చు సౌకర్యాల కల్పనవల్లనేమి వ్యవసాయోత్పత్తి కూడా క్రమంగా హెచ్చుతున్నది. విద్యుచ్ఛక్తి విషయంలో ఉత్పత్తి లక్ష్యాలను అధిగమించింది. మొత్తం ప్రణాళికా కాలం లక్ష్యం 1027 మాత్రమే అయివున్నా ప్రణాళిక మూడవ సంవత్సరం ఆఖరునాటికే 1769 పల్లెలకు, పట్టణాలకు విద్యుచ్ఛక్తి సరఫరా ఆరంభమయింది. పారిశ్రామిక రంగంలో, సిమెంటు, పంచదార, వస్త్ర పరిశ్రమల విషయంలో గమనార్హమయిన అభివృద్ధి సాధించబడింది. రాష్ట్రం శీఘ్ర పారిశ్రామికీకరణ పథంలో పయనిస్తున్నదనటానికి సందేహం లేదు.

ఇటీవల యీ రాష్ట్రంలో పర్యటించిన సందర్భంలో ప్రధానమంత్రి అన్నట్టు, మూడు సంవత్సరాల క్రిందట ఆంధ్రప్రదేశ్ అవతరించిన నాటినుండి సర్వతోముఖమయిన క్రమాభివృద్ధి జరుగుతున్నది. ఇప్పుడు కొత్త పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల చట్టం క్రింద ప్రభుత్వ అభివృద్ధి కార్యకలాపాలు బ్లాకు, జిల్లా స్థాయిలలో ప్రజాస్వామ్య వికేంద్రీకరణ సూత్రంపై జరుగడంతో యీ అభివృద్ధి వేగం యింకా హెచ్చుగలదని నా నమ్మకం.

ఐక్యత, సుహృద్భావాలు పెంపొందితే తప్ప మనం కోరే ఆనందం సమకూరదు. కాబట్టి విభిన్నవర్గాల మధ్య వాటిని పెంపొందింపచేయటానికి కృషిచేస్తూ భగవంతుని కృపకు పాత్రులమగుదుముగాక.



# 'ప్రజా సహకారం వర్ధిల్లాలి'

ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు దిగువ సందేశం యిచ్చారు:

ఏ రాష్ట్ర చరిత్రలోనైనా మూడు సంవత్సరాలు ఎక్కువ కాలం కాదు. కాని మన రాష్ట్రం యొక్క మొదటి మూడు సంవత్సరాలు నిజంగా చరిత్రాత్మక మయినవి. ఆంధ్రప్రదేశ్ అవతరణతో కొన్ని తీవ్ర సమస్యలు ఉత్పన్నమయినవి. వాటిని ఓరిమితో, పట్టుదలతో పరిష్కరించుకున్నాం. మనకు ఎంతనమ్రత ఉన్నా, యీ విషయాన్ని, రాష్ట్రం తృతీయ జన్మ దినోత్సవాన్ని జరుపుకుంటున్న సందర్భంలో స్మరించకుండా ఉండలేము. అసలు ఏకీకరణయే ఒక పెద్ద సమస్య. ఎందువల్ల నంటే, అంత భారీ పునర్వ్యవస్థీకరణ పిమ్మట ఒక చిన్న పొరపాటు మాట అన్నా, ఒక అల్ప విషయాన్ని అపార్థం చేసుకున్నా పెద్ద కల్లోలం చెలరేగగలదు. అట్లాంటివి అసలు జరుగకుండా చూడటంలో కృతకృత్యుల మయాం. ఏకీకరణ పిమ్మట, ప్రాంతీయావసరాలు కాని, ఉద్యోగాలు కాని, యితర ప్రయోజనాలకు కాని సంబంధించిన ఏ సమస్య సయినా ధైర్యంగా ఎదుర్కొని సామరస్యంతో పరిష్కరించ గలిగాం. వివాదాస్పదమైన చిన్న చిన్న విషయాలు పెక్కు వున్న మాట నిజం. సజీవము, శక్తివంతము అయిన యే సంఘానికయినా అవి సహజం. కాని యివి, బూజుదులిపి, కొత్త మెరుగులు దిద్దడానికే తోడ్పడ్డాయి.తత్ఫలితంగా నేడు ఆంధ్రప్రదేశ్ ఇంత స్వల్ప కాలంలో ఏ రాష్ట్రం సాధించలేని ఐక్యతనూ, ప్రతిపత్తిని, వ్యక్తిత్వాన్ని సాధించింది. ఇదే అన్నిటికంటే మనకు గర్వ కారణమయినది. ఇందుకు మన ప్రజల చాతుర్యం, ఓరిమి, సరిపెట్టుకునే స్వభావం, వివేకం కారణం.

కాని మనం గట్టి కృషితో సాధించినవీ చాలా వున్నాయి. కొన్ని భారీ ప్రాజెక్టుల్ని పూర్తిచేశాం. మిగిలిన వాటిని నిర్మిస్తున్నాం. ఈ కాలంలో మన రాష్ట్రంలో నీటి పారుదల పొందే ప్రాంతానికి అదనంగా మరి 3 లక్షల ఎకరాలకి పైగా కలిపాం. విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని నానాటికీ హెచ్చిస్తున్నాం. ఇందువల్ల తలసరి వాడకం 7 నుంచి 12 యూనిట్లకు హెచ్చింది. విద్యుచ్ఛక్తినిపొందే గ్రామాలు, పట్టణాల సంఖ్య 700 నుంచి 1,769 కి పెరిగింది. ఇప్పుడు మనకు ఆరు ఇంజనీరింగు కళాశాలలు, పదమూడు పాలీటెక్నిక్ సంస్థలు, ఏడు వైద్య కళాశాలలు వున్నాయి. రాష్ట్రంలో అన్ని గ్రామాలలోను పాఠశాలలు తెరువబడుతున్నాయి. తృతీయ ప్రణాళికాకాలంలో రాష్ట్రమంతటా నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టాలని నిర్ణయించాం. పాఠ్యపుస్తకాల జాతీయకరణ విజయవంతంగా ఆరంభించబడింది. ఎక్కువ ఆస్పత్రులను, వంతెనలను. రోడ్లను నిరంతరాయంగా నిర్మిస్తున్నాం. సమాజాభివృద్ధి కార్యక్రమం ఇక్కడ ఎంత పెద్ద అంగలలో సాగుతున్నదంటే, రాజస్థాన్‌తోపాటు, ప్రజాస్వామ్య వికేంద్రీకరణ విషయంలో, మనం దేశానికి మార్గదర్శులం కాగలిగాం. ఆహారోత్పత్తి విషయంలో ద్వితీయ ప్రణాళిక లక్ష్యాలను మనం అప్పుడే సాధించాం. మన బడ్జెటులో లోటులేదు. ప్రణాళికా పథకాలు తృప్తికరంగా అమలు జరుగుతున్నాయి. జాతీయం చేయబడిన రోడ్డు రవాణా సర్వీసుల విస్తరణకు ప్రజలు సంతసిస్తున్నారు. రాష్ట్రంలో రసాయన ఎరువుల ఫ్యాక్టరీని నెలకొల్పుకుంటున్నాం. ఇక్కడ మరికొన్ని భారీ పారిశ్రామిక యూనిట్ల స్థాపనకు ప్రయత్నిస్తున్నాం. బొగ్గు వుత్పత్తి క్రమంగా హెచ్చుతున్నవి. త్వరలోనే సంవత్సరానికి 30 లక్షల టన్నుల లక్ష్యాన్ని చేరవచ్చు. ప్రస్తుతం వున్న ఇతర పారిశ్రామిక యూనిట్ల విస్తరణకూడా సాగుతున్నది.

ఈ అభివృద్ధికంతకు, సహజంగా ఇటు మన సాంకేతికులు, ఇంజనీర్లు, నిపుణుల కౌశలము, వుత్సాహము, అటు మన ప్రజల సత్త్వము, త్యాగనిరతి కారణమయివున్నవి.

ముఖ్యంగా పల్లె ప్రాంతాలలో ప్రజలు అభివృద్ధి కార్యక్రమంలో ప్రశంసనీయమైన ఉత్సాహంతో సహకరించి ఐచ్ఛికంగా విరాళాలు ఇచ్చారు. ఇవి కొన్ని సందర్భాలలో ప్రభుత్వ వ్యయాన్ని అధిగమించాయి. ముందుముందు కూడా కృషి అన్ని రంగాలలోను నానాటికీ హెచ్చే ప్రమాణంలో యీ సహకారం లభిస్తుందని నమ్ముతున్నాను, ఎందుచేతనంటే, మనంచేసే పనులన్నీ నిజానికి స్వీయాభివృద్ధికై సమాజం చేసే కృషితప్ప మరొకటేమీ కాదు.



# మంత్రివర్గ నిర్ణయాలు

రాష్ట్ర మంత్రివర్గం 5-10-59 న సమావేశమయి ప్రయోగాత్మక చర్యగా కర్నూలు, మహబూబునగరం జిల్లాల్లో జాయింట్ కలక్టర్లను నియమించటానికి నిర్ణయించింది. కలక్టర్లు తమ కృషిని అభివృద్ధి కార్యక్రమాలపై కేంద్రీకరించటానికి వీలు కల్పించటం యీచర్య ఆశయం. కర్నూలు జిల్లాలో వరంగల్లు సబ్-కలక్టరు శ్రీ వి. కె. దార్, మహబూబునగరంలో మెదక్ సబ్-కలక్టరు శ్రీ ఎ.కె. అన్సారీలు నిర్ణయించబడ్డారు.

విజయవాడలోని ఆంధ్ర రాష్ట్ర సహకార బ్యాంకు, వ్యవసాయ పనులు వగైరాకు పెట్టుబడి పెట్టడానికి రిజర్వుబ్యాంకు నుంచి తీసుకోగల రూ 150 లక్షల అప్పుకి హామీ యివ్వడానికి కూడా మంత్రివర్గం నిర్ణయించింది.

హైదరాబాదులోని ఆంధ్ర సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకుకి ఇండియా స్టేట్ బ్యాంకు అప్పు రూ 50 లక్షల విషయంలో హామీ యివ్వడానికి మంత్రివర్గం అంగీకరించింది.

జమీందారీల రద్దు చట్టాన్ని, మద్రాసు జమీందారీ శిస్తు తగ్గింపు చట్టాన్ని యిటీవల నల్గొండ, వరంగల్లు జిల్లాలకు బదిలీ చేయబడ్డ మద్రాసు ప్రాంతాలకు వర్తింపచేయటానికి నిర్ణయించబడింది.



# గ్రామ రాజ్య దీపావళి

— కళ్యాణసింగ్

ఆమె జీవితంలో
రాగం స్పందించింది,
ఆమె త్యాగం చిందించింది
సృష్టి చేసింది తల్లి
తన రక్తంలోని సారం తీసి
తన శుక్తంలోని శుక్రం తెచ్చి
తన అస్థుల్లోని మూలుగ కోసి
తన మస్తిష్కంలోని మంతువు త్రచ్చి
పురుషుణ్ణి సృజించింది రామ
పుత్రుణ్ణి స్పృశించింది ప్రేమ
అర్భక జీవన పిండం ఆమె తనువున సోలి
ఆమె రుధిరరసం మధుర రసంగా గ్రోలి
ఇంత ఐ అంత ఐ, వింతగా మారింది మౌళి
మీసాలు మొలిచిన మొనగాడు
రోసముతో మెలి వేశాడు
స్త్రీ అంటే అబల అనే సిద్ధాంతం ఒకటి చేశాడు
శ్రీ మత్పురుషుని ప్రక్క యెముకలో
స్త్రీ పుట్టిందని చెప్పాడు
స్త్రీని చూచి, 'నేను భర్తను, నువ్వు భార్యవు'
—అన్నాడు
భరించేవాని వేడి భరింపలేక పోయింది చిగురుబోడి
ఈ లోకాన్ని ఏలేది నేనే అని అహంకరించాడు.
నీ కెందుకు మూలను కూర్చోమని హుంకరించాడు
శ్రేయస్సాధనకోసం కృషి చేస్తానని లేచాడు.
కర్కశకరముల భూమిని త్రవ్వగ
క్షారజలములే ఊరినవి,
ఉప్పునీటినీ పారింపంగా
ఊషరభూమిగ మారినది,

ఊషరభూమిని పైరు పెట్టగా
ఉమ్మలికములే పండినవి,
సాధుజనులకూ సామాన్యులకూ
సౌఖ్యము లన్నియు ఎండినవి
సత్యాన్వేషణకోసము శాస్త్రము త్రవ్వి చూడగా
వచ్చినవీ
అణుబాంబులూ, ఉదజని బాంబులు ఇంకా ఎన్నో
అవీ ఇవీ
దండపాలనము చేశాడు
భండన భూమిని దూకాడు,
పురుషుడు చేసిన గాయాలను జాలితో
పుణ్యపురంధ్రియె మాన్పింది
ప్రజాస్వామ్య మంటే పురుష స్వామ్యం కాదు,
అతివలు లేకుంటే అందులో స్వామ్యం లేదు
ప్రజాస్వామ్య మంటే మానవత్వం
మానవత్వ మంటే సమానత్వం
సమానత్వ మంటే సహకారతత్త్వం
కొన్నాళ్లు నిలుస్తే మంచిది పురుషుల అధికార పాలనం.
అభ్యుదయానికి అవసరం అతివల అనురాగలాలనం
పురుషునికి సృజనశక్తి లొచ్చు, సంహరణశక్తి హెచ్చు
మహిళ జనయిత్రి, ఆమెకు అనుకంప పెచ్చు
సమర ప్రీతిగల పురుషునికి సామరస్యం పూజ్యం
అతనికి కొన్నాళ్లపాటు రాజ్యపాలనం త్యాజ్యం
ప్రజాస్వామ్య పరివృద్ధికి గ్రామమే మూలకందం
గ్రామ పాలనకు మరి పంచాయతీయే తగు చందం
పంచాయతీల నిర్వహణలో పడతులకు కూడ భాగం
మహిళామణుల త్యాగం మనకు కలిగిస్తుంది యోగం
వవ్వేరులో అనంతపురములో
పంచాయతీ వారందరు పైదలులే
ఇంకా ఇలాంటి పంచాయతీలు
ఎన్నో వందలు కావాలి.
తొలికాలంలో కలకలలాడిన గ్రామ సభాసదనాలు
కాలక్రమాన్ని అయిపోయాయి కాలాంధకారనిలయాలు
ఒక్కొక్క పంచాయతీలో ఒక్కొక్క
ఉగ్మలి చేసే దీపారాధన
ఆంధ్ర ప్రదేశాన్ని దీప్తం చేసే
అఖండ దీపావళిపై సాధన

# 'ఇది మీరు వెలిగించిన దీపం'

**1955** డిసెంబరులో ప్రధాని పండిట్ నెహూర్రి నాగార్జున సాగర్ ప్రాజెక్టును ప్రారంభించినప్పుడు 'అది భారతదేశంలో నిర్మితమయే కొత్త కోవెలలకు చిహ్నమన్నారు. ఆయన మళ్లీ గడచిన నెల ఆ ప్రాజెక్టును దర్శించినప్పుడు అక్కడ ఒక కార్మిక వృద్ధుడు 'ఇది మీరు వెలిగించిన దీపం' అని అనగా ఆ మాటకు ఆనందపరవశులై తమను గురించి యిదివరకెన్నడూ, యెవ్వరూ యింత ఘనమయిన ప్రశంసావాక్యాన్ని పలకలేదన్నారు. ఆకార్మికుని మాటలను తాను తెలుగులో అంటూ అవి విన్నప్పుడు తమలో ఒక నమ్రత, ఒక గర్వము పొడసూపినవన్నారు. తమ జీవితకాలంలో కొన్ని దీపాలను వెలిగించే అవకాశం లభిస్తే తమ జన్మ సార్థకం కాగలదన్నారు. ప్రధాన మంత్రి మన రాష్ట్రంలో చేసిన పర్యటనను గూర్చి కొన్ని వివరాలు దిగువ యివ్వబడినవి:

ప్రధాన మంత్రి రాష్ట్రంలో 1959 అక్టోబరు 10మొదలు 13 వరకు పర్యటించారు. ఉత్సాహోజ్జ్వలమయిన యీ పర్యటన సందర్భంలో ఆయన ప్రజలకిచ్చిన సందేశం ఐక్యత, సహకారం, పరిశ్రమ.

భారతదేశం ఒక మహా కుటుంబమనీ, ప్రతి వ్యక్తి దాని అభివృద్ధికై పాటుపడాలనీ, ప్రజల ఆలోచనలలోను, కృషిలోను యే కొందరి సౌభాగ్యానికో కాక దేశంలోని నలభయి కోట్ల మంది ఉన్నతికి స్థానం ఉండాలని, వ్యక్తులు యే వృత్తి నవలంబించినా భారతదేశంయొక్క యీ బృహత్కృషితో సంబంధంవుండాలని ఆయన తమ ప్రసంగాలలో నొక్కి చెప్పారు. 'స్వరాష్ట్రాన్ని ప్రేమించినా, మీరు భారతదేశంలో ఒక భాగమనే మాటను, విదేశాలు మిమ్ములను భారతీయులుగానే యెరుగును అన్న మాటను మీరు విస్మరించకూడదు' అని ఆయన చెప్పారు. ఆ విషయం వారికి జ్ఞాపకం వున్ననాడు, తాము యేపని చేసినా ఆ మహా జాతీయ కృషిలో ఒక భాగమేనన్న ఆలోచన కలుగుతుంది. తన్మూలంగా వారు బలసంపన్నులై తమ పాత్రను యెక్కువ సమర్థంగా నిర్వహించ గలుగుతారు, అన్నారాయన.

ఆయన యింకా యిలా అన్నారు: ఇప్పుడు అన్ని రంగాలలోను జాతీయాభివృద్ధికి కీలకం సహకారం. చాలా కాలం క్రితమే దేశానికి సహకార కామన్‌వెల్తు ఆదర్శం నిర్ణయించబడింది. ఇప్పుడా గమ్యంవైపు మనం పయనించాలి. పదమూడు సంవత్సరాల క్రితం దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది. ఇప్పుడు ఆర్థిక స్వరాజ్యాన్ని, సంక్షేమ స్వరాజ్యాన్ని, 'సౌభాగ్య స్వరాజ్యాన్ని' సాధించవలసి వుంది. ఇందు నిమిత్తం పంచవర్ష ప్రణాళికలు అమలుపరచబడుతున్నాయి. దేశం వివిధ రంగాలలో అభివృద్ధి సాధించబడుతున్నది. గొప్ప గొప్ప ప్రాజెక్టులు, పరిశ్రమలు వెలుస్తున్నాయి. అయినప్పటికీ, దేశ జనాభాలో 70,80 శాతం గ్రామాలలో నివసిస్తారు కాబట్టి, భారతదేశం గ్రామాల దేశమే. కాబట్టి భారతదేశ సౌభాగ్యం గ్రామ సౌభాగ్యంపై ఆధారపడి వుంటుంది. ఈ గ్రామాల ఆర్థిక వ్యవస్థ ముఖ్యంగా వ్యావసాయికం కాబట్టి వాటి అభివృద్ధికి వుత్తమ వ్యవసాయం అత్యవసరం. ఈ అభివృద్ధిని సహకార విధానాలలో సాధించవచ్చు. రైతులు, వ్యష్టి ప్రయత్నంలో సాధించలేని పెక్కు ఫలితాలను సమిష్టి కృషిలో సాధించగలరు. మొదట సహకార వ్యవసాయ సంఘాలను యేర్పరచుకొని, వనరులను సమీకరించుకుని పిమ్మట ఆధు

నిక వ్యవసాయ పద్ధతులను అవలంబించ వచ్చు. ఆ తరువాత లాభదాయకం అనుకుంటే సమిష్టి లేక సహకార వ్యవసాయం ఆరంభించ వచ్చు. ఇది కేవలం ఐచ్ఛికమయినది. ఈ విషయంలో నిర్బంధమేమీ వుండదు. సహకార వ్యవసాయం క్రింద కూడా రైతుకి భూమిపై స్వామ్యం వుంటుంది, విడిపోవాలనుకుంటే యే దశలోనైనా విడిపోవచ్చు. కాని సహకార వ్యవసాయం రైతులకు, దేశానికి కూడా మంచిదని నా విశ్వాసం. అది సరయినది అన్న నమ్మకం కుదిరినప్పుడు పెక్కు యితర విషయాలలో వలెనే దీని సాధనకుకూడా నేను కృషి చేస్తాను.

సహకార వ్యవసాయం గురించి యింకా వివరిస్తూ ఆయన యిలా అన్నారు: శాస్త్రీయ విధానాలను అవలంబించటానికి ఒకటి రెండు యెకరాలుగల రైతులకి బలం, వనరులు లేక సాధన సంపత్తి వుండదు. కాబట్టి వారు సాధారణంగా వడ్డీ వ్యాపారుల పిడికిలిలో వుంటారు. వ్యవసాయంలో శాస్త్రీయ విధానాల అవలంబన ద్వారా యెక్కువ వుత్పత్తిని సాధించటం ప్రస్తుత సమస్య. "భారతీయ రైతాంగం, భారతీయ వ్యవసాయాల అభివృద్ధికి, విధియయిన, యెదురులేని జవాబు సహకారం అని నేనంటాను. ఈ విశాల ప్రపంచంలో ఈ మాటను కాదనే వారెవరైనా వుంటే చెప్పవచ్చు."



తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో శ్రీ కృష్ణదేవరాయలు, ఆయన దేవేరుల కంచు విగ్రహాలను ప్రధాని తిలకిస్తున్న దృశ్యం.

## మొత్తం దేశానికే

పారిశ్రామిక రంగంలో అభివృద్ధికి కూడా సహకార సూత్రం అత్యవసరం. అందువల్లనే చీరాలలో సహకార నూలు మిల్లుకి శంకుస్థాపన అంటే నాకు విశేషానందం కలిగింది. మన దేశంలో పెక్కు భారీ పరిశ్రమలకు, చిన్న పరిశ్రమలకు కూడా అవకాశం వుంది. ఇది సహకార ప్రాతిపదికపై యేర్పాటయినప్పుడు యెక్కువ లాభసాటి కాగలవు. నిజానికి మొత్తం దేశానికే సహకార ప్రాతిపదిక అవసరం. ఆయన యింకా యిలా అన్నారు:

## మూడు స్తంభాలు

ఇతర దేశాలు వైజ్ఞానికంగా, పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందాయి. అవి చంద్రగోళానికి రాకెట్లను సైతం పంపాయి. అపారమయిన వాటి వైజ్ఞానిక, సాంకేతిక పరిజ్ఞానమే యిందుకు కారణం. ప్రజలకు మంచి సాంకేతిక పరిజ్ఞానం వున్నప్పుడు పరిశ్రమలకు కాని, వ్యవసాయంలో



13-10-'59న ప్రధాన మంత్రి చీరాల సహకార నూలు మిల్లుకు శంకుస్థాపన చేస్తున్న దృశ్యం.

కాని చక్కగా పనిచేసి వస్తూత్పత్తిని హెచ్చించగలుగుతారు. అందువల్లనే ఇంజనీరింగు కళాశాలలు, పాలీటెక్నిక్ సంస్థల వంటి కొత్త సాంకేతిక సంస్థల ప్రారంభం సరి అయిన చర్య. ఎక్కువ విద్య అంటే యెక్కువ విజ్ఞానం, యెక్కువ కృషి, యెక్కువ వస్తూత్పత్తి అని అర్థం. కాబట్టి గ్రామాలలో పిల్లలకు యింకా యెక్కువ విద్యా సౌకర్యాలు అవసరం. ప్రతి గ్రామానికి ఒక పాఠశాల, ఒక సహకార సంఘం, ఒక పంచాయతీ వుండాలి—ఇప్పుడు గ్రామాభ్యుదయమనే భవనానికి ఇవి మూడు స్తంభాలు.

## పంచాయతీ సమితి

షాద్ నగరం పంచాయతీ సమితి ప్రారంభంతో చట్టబద్ధంగా ప్రజాస్వామ్య వికేంద్రీకరణ సూత్రం అమలు ఆరంభమయినదని, తమ ఆంధ్రప్రదేశ్ పర్యటనలో యిది మిక్కిలి ప్రాముఖ్యంగల ఘట్టమని ప్రధాని పలుమారులు నొక్కి చెప్పారు. ఆయన యింకా యిలా అన్నారు: ఇది చాలా గొప్ప చర్య పదమూడు సంవత్సరాల క్రితం స్వరాజ్యం వచ్చేక దాని తరువాత మిక్కిలి ప్రాముఖ్యం గలది యిదే. ఇందులో గ్రామీణులకు నిజమయిన స్వరాజ్యం లభిస్తుంది. ఇప్పుడు వారి యింటికి వారే పెద్ద. వారి అభివృద్ధికి అవసరమయిన పద్ధతులను వారే నిర్ణయించుకుని, వారి నిర్ణయాలను వారే అమలు పరుచుకోవచ్చు. ప్రభుత్వం వారికి కేవలం సలహా, సహాయాలను అందిస్తూ వుంటుంది. ఈ విశిష్ట చర్య రాజస్థాన్ లోను, ఆంధ్రప్రదేశ్ లోను తీసుకొనబడింది, ప్రజలు తమ యీ కొత్త అధికారాన్ని వివేకంతో వుపయోగించుకొన్నట్లయితే, యితర రాష్ట్రాల మన్ననల నందుకొనటమే కాక వాటికి మార్గదర్శులు కూడా కాగలరు.

భారతదేశంలో నూతన సంఘ నిర్మాణం ఒక్కనాటిలో అయ్యే పని కాదు. ఆధునిక వ్యవసాయం, పరిశ్రమల

ద్వారా దానిని ఓరిమితో సాధించాలి. చివరకి, భారతదేశ క్షేమం శీఘ్ర పారిశ్రామిక విప్లవం మీదనే ఆధారపడి వుంటుందని నా నమ్మకం. ఈ విప్లవ వేగం అమెరికా, రష్యా దేశాల వేగాన్ని మించినా మించవచ్చు.

ఊపిరి సలుపని కార్యక్రమంతో కూడిన ప్రధాని పర్యటన వరంగల్లు నుంచి ఆరంభమయింది. ఆ తరువాత ఆయన హైదరాబాద్, షాద్‌నగరం, వనపర్తి, విజయవాడ, చీరాల, నెల్లూరు, తిరుపతి సందర్శించారు. వరంగల్లు ఇంజనీరింగు కళాశాలను ఆయన సలాంఛనంగా ప్రారంభించారు. దాని కొత్త భవనానికి శంకుస్థాపన చేశారు. వనపర్తిలో శ్రీ కృష్ణదేవరాయ పాలీటెక్నిక్ సంస్థను ప్రారంభించారు. తిరుపతిలో ఇంజనీరింగు కళాశాలకు, చీరాలలో సహకార నూలుమిల్లుకు శంకుస్థాపనచేశారు. షాద్‌నగరంలో పంచాయతీ సమితిని, అక్కడ అధికార, అనధికారుల సమ్మేళనాన్ని, అలాగే తిరుపతిలో సైన్సు కొత్త బ్లాకును, ఒక సంగీత నృత్య కళాశాలను ప్రారంభించారు. ఆపైన, నాగార్జున కొండ వద్ద పురావస్తు శిథిలాలను, నాగార్జున సాగర్ ప్రాజెక్టు వద్ద ఆనకట్ట, కాలువల పురోగతిని పరిశీలిస్తూ ఒక్కపూట గడిపారు. అక్కడి ఇంజనీర్లను వుద్దేశించి చేసిన చిన్న ప్రసంగంలో ఇంజనీర్లు వారాని కొకటి రెండు సార్లు కార్మికులను కలుసుకోవాలని సూచించారు. ఇంజనీర్లు కార్మికులను తోటి పనివారుగా పాటించి తాము కూడా జాతీయ మహా కృషిలో పాల్గొంటున్నామనే భావాన్ని కార్మికులకు కలిగించాలన్నారు. తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ విద్యార్థులను కూడా అలాగే ప్రబోధిస్తూ వారు విశాలంగా ఆలోచించి నూతన భారత నిర్మాణమనే మహా కార్యానికి అంతా భక్తిగా తోడ్పడాలనీ, కేవలం యేవో ఉద్యోగాలు సంపాదించటంతో తృప్తి పడ వద్దనీ అన్నారు.

## నేత పని వారికి హామీ

ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ బహుముఖాల అభివృద్ధి చెందుతున్నదని ప్రధాని అన్నారు. సమాజాభివృద్ధి రంగంలో తీసుకున్న ప్రముఖ చర్య కాక పారిశ్రామిక, వ్యవసాయ రంగాలలో నేమి, శిక్షణ సౌకర్యాల విషయంలో నేమి జరిగిన అభివృద్ధి తమకు సంతోషం కలిగిస్తున్నదన్నారు. ముఖ్యంగా చీరాలలో నేత పనివారి నుద్దేశించి ఇలా అన్నారు: దేశంలో ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో నేత పనివారి ప్రాముఖ్యాన్ని మేము గుర్తించాం. వారి సంఖ్య గొప్పది. వారు సన్నని వస్త్రాలు తయారు చేస్తారు. వారి పని అలా కొనసాగాలని, అందుకు వారికి మేము తోడ్పడాలని మా ఆకాంక్ష."

తమ పర్యటన సందర్భంలో ఆంధ్ర ప్రజానీకం తమ పట్ల చూపిన ప్రేమాదరాలకు వారికి కృతజ్ఞత తెలిపారు. ప్రధాని తిరుపతిలో తమ ప్రసంగాన్ని ముగిస్తూ "ఆంధ్ర ప్రజలు నాకు గర్వ కారకులు" అన్నారు.



నాగరికత అంటే యుద్ధంతో సంబంధం లేని పౌరుల అభిప్రాయంపై ఆధారపడిన సంఘం అన్న మాట. అక్కడ దౌర్జన్యం, యుద్ధ వీరులు, నిరంకుశ నాయకుల పాలన, శిబిరాలు, యుద్ధచర్యలు, కల్లోలం, నిరంకుశత్వం యివన్నీ వైదొలగి పార్లమెంటులకు, స్వతంత్రమయిన న్యాయస్థానాలకు చోటు చేస్తాయి.

— విన్‌స్టన్ చర్చిల్

# దివ్య దీపావళి

సరిగ్గా మూడు సంవత్సరాల నాడు దీపావళి రోజున వెలుగు చూసింది ఆంధ్ర ప్రదేశ్. ఆ రోజున ముక్కోటి ఆంధ్రుల హృదయాలలో ఆనందజ్యోత్స్నలు వెల్లివిరిసాయి. ఇప్పుడు మరొక దీపావళి రాకతో దీపావళి మరింత తేజో మయమై ప్రకాశిస్తున్నది. ఆశాజ్యోతులు ఆకాశాన్నంటు తున్నవి. కారణం, యీ మూడు సంవత్సరాల స్వల్ప కాలంలోను చాల సత్కృషి జరిగింది, ఇంకా గొప్ప పనుల సాధనకు దృఢమైన పునాదులు వేయబడినవి.

1957 మార్చి 20 న నూతన రాష్ట్రం బడ్జెట్టును సమర్పించి నప్పుడు 1957–58 కి రూ. 50.23 కోట్ల ఆదాయాన్ని మాత్రమే అంచనావేయగలిగేరు, ఖర్చు రూ. 55.53 కోట్లు. ఐతే ఆ సంవత్సరం తుది జమా ఖర్చులలో ఆదాయం రూ. 62.33 కోట్లు తేలగా వ్యయం రూ. 55.11 కోట్లు, పెట్టుబడి ఖర్చు రూ. 25.28 కోట్లు తేలాయి. 1959–60 అంచనాలలో గమనార్హమైన హెచ్చుదల వుంది. ఆదాయం రూ. 71. 29 కోట్లు, వ్యయం రూ. 71.66 కోట్లు. పెట్టుబడి ఖర్చు రూ. 28. 30 కోట్లు.

### ప్రణాళిక

1956–57 లో పంచవర్ష ప్రణాళికా పథకాలపై రూ. 24. 31 కోట్లు ఖర్చు పెట్టబడినవి. 1958–59 లో ప్రణాళికా వ్యయం గరిష్ఠ పరిమితి రూ. 35 కోట్లకు హెచ్చించ బడింది. జరిగే సంవత్సరం అది రూ. 41. 03 కోట్లుగా నిర్ణయించ బడింది. ఇప్పుడు ద్వితీయ ప్రణాళిక సొమ్ము రూ. 175. 74 కోట్లు పూర్తిగా ఖర్చుపెట్ట బడగలవని నమ్మకం చిక్కింది.

### సమాజాభివృద్ధి

సమాజాభివృద్ధి రంగంలో చక్కని అభివృద్ధి సాధించ బడింది. రాష్ట్రావతరణ నాటికి అన్ని రకాలు కలిసి 121 అభివృద్ధి కేంద్రాలు మాత్రమే ఉన్నాయి. వీటి క్రింద 9,229 గ్రామాలు, 97.77 లక్షల ప్రజలు ఉన్నారు. నేడు 17, 991 గ్రామాలు, 189 లక్షల జనాభాతో 282 కేంద్రాలు ఉన్నాయి. ఇప్పుడీ కార్యక్రమం క్రింద రాష్ట్రంలో 59 శాతం విస్తీర్ణం, 68 శాతం గ్రామాలు, 73 శాతం పల్లె ప్రజలు ఉన్నారు.

1956 డిసెంబరు ఆఖరునాటికి ప్రజల విరాళం రొఖ్ఖం, శ్రమ, వస్తు రూపాలలో రూ. 240 లక్షల వరకు వచ్చింది. 1959 మార్చి ఆఖరికి యిది రూ. 545 లక్షలకు పెరిగింది. ఇది ప్రభుత్వ ఖర్చుకంటె 50.6 శాతం కంటె ఎక్కువ. దాదాపు 25 అభివృద్ధి కేంద్రాలలో ప్రజా విరాళం విలువ ప్రభుత్వ వ్యయాన్ని మించిపోయింది.

ప్రజాస్వామ్య వికేంద్రీకరణ పథకాన్ని అంగీకరించి క్రిందటి సంవత్సరం ఆంధ్ర ప్రదేశ్ 20 అడ్ హాక్ పంచాయతీ సమితులను ఏర్పరచింది. వీటి కృషి ప్రోత్సాహకరంగా ఉంది. ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల చట్టాన్ననుసరించి ఇప్పుడు చట్టబద్ధమైన సమితులు, పరిషత్తులు ఏర్పరచబడుతున్నాయి. వీటిలో తొలి సమితి 11-10-59న షాద్‌నగర్‌లో ప్రధానమంత్రిచే ప్రారంభించబడింది.

ప్రతి జిల్లాలోను ఒక గ్రామంలో 'కుటుంబానికొక ప్రణాళిక' ప్రవేశపెట్టబడింది. అక్కడ ప్రతి కుటుంబానికి తగిన ప్రణాళికను తయారుచేయటానికై ఆ గ్రామం ప్రత్యేకంగా ఒక శిక్షితుడైన గ్రామ కార్యకర్తకు అప్పగించ బడింది.

### ఆహారోత్పత్తి

ద్వితీయ ప్రణాళిక ఆరంభంనాటికి ఆంధ్రప్రదేశ్ 54.21 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను పండిస్తున్నది. గడచిన సంవత్సరం పంట 61.56 లక్షల టన్నులు. ప్రస్తుతపు ప్రణాళికకు నిర్ణయించబడిన లక్ష్యాలు సిద్ధించాయి. ఐనా పంటను ఇంకా హెచ్చించటానికై సర్వతోముఖమైన కృషి జరుపబడుతున్నది. కొత్తగూడెంలో రూ. 25 కోట్లతో రసాయన ఎరువుల కర్మాగారం నెలకొల్పబడుతున్నది. అధికాహారోత్పత్తి విషయంలో ఇది చాల తోడ్పడగలదు.

### పరిశ్రమలు

1956 లో సింగరేణి బొగ్గుగనులలో 17.46 లక్షల టన్నుల బొగ్గు తయారయింది. అది ఇప్పుడు 21 లక్ష టన్నుల్ని మించి తయారవుతున్నది. లక్ష్యమయిన 30 లక్షల టన్నులను సాధ్యమైనంత త్వరలో సాధించటానికి కృషి జరుగుతున్నది.

రాజమండ్రి కాగితం మిల్లుల్ని, గూడూరు పింగాణి ఫ్యాక్టరీని విస్తరించే కార్యక్రమాలు ఉన్నాయి. ఈ రాష్ట్రంలో ఆంటీ బైయాటిక్సు తయారీకి ఒక ఫ్యాక్టరీని, మందుల తయారీకి ఒక ఫ్యాక్టరీని, శస్త్ర చికిత్స పరికరాల తయారీకి ఒక ఫ్యాక్టరీని కేంద్ర ప్రభుత్వంచే నెలకొల్పబడ చేయటానికి కృషి జరుగుతున్నది.

రాష్ట్రంలో తెరువబడే ఆరు పారిశ్రామిక కేంద్రాలలోను సనత్‌నగరం కేంద్రంలో పెక్కు యూనిట్లు అప్పుడే పని ప్రారంభించాయి. మరి నాలుగు కేంద్రాలు పూర్తి కావస్తున్నాయి. ఆరవది త్వరలోనే ప్రారంభమవుతుంది.

ఖాదీ, గ్రామ పరిశ్రమల పథకాలను సమన్వయం చేసి వాటి అమలును ప్రోత్సహించటానికై ఖాదీ, గ్రామ పరిశ్రమల బోర్డు ఏర్పాటుచేయబడింది. కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన సెస్సు నిధులనుంచి చేనేత పరిశ్రమ అభివృద్ధికై రూ. 41 లక్షలపై 25 పథకాలు మంజూరు చేయబడినవి.

### నీటిపారుదల

ద్వితీయ ప్రణాళికలో వివిధ నీటిపారుదల పథకాల ప్రగతి సంతృప్తికరంగా ఉంది. ఈ సంవత్సరాంతానికి ప్రణాళిక ఆరంభంనాటికి గల నీటి పారుదల ప్రాంతానికి మరొక 3.6 లక్షల ఎకరాలు కలుపబడగలవని భావించబడుతున్నది.

పెద్దప్రాజెక్టులయిన రొంపేరు, తుంగభద్రాదిగువకాలువ, కృష్ణా బ్యారేజీ కూడా పూర్తి అయి ఉపయోగంలోనికి తేబడినవి. రూ. 13 కోట్ల అంచనాపై తుంగభద్రా ప్రాజెక్టు ఎగువ కాలువ మొదటి అంచె పని ఆరంభించబడింది.

నాగార్జునసాగర్ ప్రాజెక్టు విషయంలో మంచి అభివృద్ధి సాధించబడుతున్నది. ఆనకట్ట కొన్ని చోట్ల 60 అడుగుల ఎత్తు లేచింది. ఇరువైపుల కాలువలు 50 మైళ్ల పొడుగున త్రవ్వబడినవి. ఇప్పుడీ ప్రాజెక్టుపై ఏటా రూ. 14 కోట్లు ఖర్చుచేయవచ్చు.

రూ. 15 కోట్ల అంచనాపై గోదావరిపై నిర్మించదలచుకున్న పోచంపాడు ప్రాజెక్టు పరిశోధన పూర్తి అయింది. ప్రాజెక్టు నివేదిక కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమీషన్‌కి పంపబడింది.

### విద్యుచ్ఛక్తి

ద్వితీయ ప్రణాళిక ఆరంభంనాటికి ఆంధ్ర ప్రదేశ్‌లో విద్యుచ్ఛక్తి తలసరి వాడకం 7 యూనిట్లు. ఇప్పుడది 12 యూనిట్లకు హెచ్చింది. ద్వితీయ ప్రణాళిక సమాప్తినాటికి అది 15 యూనిట్లు కాగలదు.

ప్రణాళిక ఆరంభంనాటికి 700 గ్రామాలకు, పట్టణాలకు విద్యుచ్ఛక్తి సరఫరా అవుతున్నది. ఇప్పుడు విద్యుచ్ఛక్తిని పొందే గ్రామాల సంఖ్య 1769.

మచ్‌ఖండ్‌లో 21.250 కె. వా. శక్తిగల 4 వ, 5 వ మెషిన్లు ఇటీవల పని ప్రారంభించాయి. 25,000 కె. వా. శక్తిగల రామగుండం థెర్మల్ కేంద్రం పని ప్రారంభించింది. ఆ కేంద్రం నుంచి సిర్పూరు, బెల్లంపల్లి, మంచిర్యాల, వరంగల్లులలో పరిశ్రమలకు మొత్తం గాను, హైద్రాబాదు నగరానికి కొంతవరకూను విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడుతున్నది.

ఇటీవల ఒరిస్సాతోజరిగిన ఒప్పందాన్ననుసరించి ఆంధ్ర ప్రదేశ్ ఇప్పుడు ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి పథకాన్ని అమలు జరుపుకో వచ్చు. దీని అంచనా శక్తి 1.2 లక్షల కె. వా. 2.28లక్షల కె.వా. అంచనాశక్తిగల శ్రీశైలం ప్రాజెక్టు కూడా పరిశోధించబడింది. ఈ సంవత్సరం ఒక విద్యుచ్ఛక్తి బోర్డు ఏర్పాటు అయి పని చేస్తున్నది.

### రాకపోకల సౌకర్యాలు

భద్రాచలానికి సమీపంలో గోదావరిపై రూ. 57 లక్షల

వ్యయంతో ఒక వంతెన నిర్మించబడుతున్నది. ఇది శ్రీరామాలయాన్ని దర్శించే వేలాది యాత్రికులకు వర ప్రసాదం కాగలదు. తూర్పు గోదావరి జిల్లాలో గోదావరి గౌతమి పాయపై వంతెన, కర్నూలు సమీపంలో తుంగభద్రపై వంతెనల నిర్మాణం కొనసాగుతున్నది. మహబూబు నగరం జిల్లాలో కృష్ణానదిపై ఒక వంతెన నిర్మించబడు తున్నది. గోదావరి వసిష్టపాయపై రూ. 96లక్షల ఖర్చుయే మరొక వంతెన చేపట్టబడుతున్నది.

జాతీయం చేసిన రోడ్డు రవాణా సర్వీసుల నిర్వహణకై ఒక సంస్థ నెలకొల్పబడింది. జాతీయకరణ సర్వీసులు క్రమేణా ఆంధ్ర జిల్లాలకుకూడా విస్తరించబడు తున్నాయి.

## విద్య

సాంకేతిక విద్య విషయంలో గమనార్హమైన అభివృద్ధి జరిగింది. ఇప్పుడు రాష్ట్రంలో అరడజను ఇంజనీరింగు కళాశాలలు. పదమూడు పాలీటెక్నిక్ సంస్థలు, రెండు గనుల ప్రత్యేకం సంస్థలు ఉన్నాయి. కర్నూలు, వాల్తేరు లలో స్త్రీల కళాశాలలు రెండు కొత్తగా ఏర్పడ్డాయి. ఈ సంవత్సరానికి రాష్ట్రంలో పాఠశాల లేని గ్రామం ఒక్కటయినా లేకుండా చూడటానికై శరవేగంతో కొత్త పాఠశాలలు తెరువబడుతున్నాయి. ఆంధ్ర ప్రాంతంలో నాన్ గెజిటెడ్ ఉద్యోగులకు గల విద్యా సౌకర్యాలు ఇప్పుడు తెలంగాణా ప్రాంతానికికూడా విస్తరించబడినవి. అట్టి కొన్ని సౌకర్యాలు రాజకీయ బాధితుల పిల్లలకు, మనుమలకుకూడా ఇవ్వబడినవి. తృతీయ ప్రణాళిక సమాప్తి నాటికి రాష్ట్రమంతటా నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రవేశ పెట్టాలని ఇప్పుడు ప్రభుత్వం నిర్ణయించింది.

పాఠ్య పుస్తకాల జాతీయకరణ విధానం అమలుకై హైద్రాబాదులో పాఠ్య పుస్తకాల ముద్రణాలయం నెలకొల్ప బడింది. రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాలకు సంబంధించిన చట్టాలలో కొన్ని మార్పులను ప్రవేశపెడుతూ మూడు కొత్త చట్టాలు చేయబడినవి.

కర్నూలు, కాకినాడ, వరంగల్లులో కొత్తగా మూడు కళాశాలలు వెలిశాయి. తృతీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో తిరుపతిలో మరొక దాని ఏర్పాటుకు పథకం వేయబడింది. హైదరాబాదులో బి.ఎస్‌సి. నర్సింగు కోర్సుతో ఒక నర్సింగు కళాశాల ఏర్పాటు చేయబడింది.

## ఆరోగ్యం

రాష్ట్రంలో వైద్య సౌకర్యాలు సత్వరంగా అభివృద్ధి చేయబడినవి. తెలంగాణాలో ఆస్పత్రుల పడకల సంఖ్య హెచ్చించబడుతున్నది. ఈ కార్యక్రమంవల్ల 1961 మార్చికి పూర్వం వాటిలో ప్రతి ఒక్క దానిలోను 100 పడకలు, పెక్కు తాలూకా ఆస్పత్రులలో 50 పడకలు ఉండగలవు. సంగారెడ్డి, ఖమ్మం, మహబూబునగరాలలో కొత్త ఆస్పత్రులు నిర్మింపబడుతున్నాయి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు తెలంగాణాలో 37, ఆంధ్రలో 80 తెరువబడినవి. ఇవి కాక సబ్సిడైజుడు గ్రామీణ డిస్పెన్సరీలు ఆంధ్రలో 81, తెలంగాణాలో 140 ప్రారంభించబడినవి. హైద్రాబాదులోని నిరోధక వైద్యం, కేంద్ర లేబొరేటరీల సంస్థ గిండీ కింగ్ ఇన్‌స్టిట్యూటువంటి సంస్థగా శరవేగంతో అభివృద్ధిచేయబడుతున్నది. గుంటూరు, విశాఖపట్నం, వరంగల్లు, కర్నూలులలో ప్రాంతీయ లేబొరేటరీలు తెరువబడినవి. ఈ ప్రణాళికా కాలంలో అన్ని జిల్లాల్లోను జిల్లా లేబొరేటరీలు కూడా నెలకొల్పబడతాయి.

## ఇతర విషయాలు

ద్వితీయ ప్రణాళిక కాలంలో రాష్ట్రంలో 45 సహకార వ్యవసాయ సంఘాలను ఏర్పాటు చేయాలని సంకల్పం. వీటిలో 14 అప్పుడే ఏర్పాటయినవి.

రాష్ట్రంలో తక్కువ రాబడి వర్గాల గృహ నిర్మాణ పథకం గమనార్హమైన ప్రగతిని సాధించింది. అభివృద్ధి కేంద్రాల్లలో నిర్ణీతమైన గ్రామాలలో గ్రామ గృహ నిర్మాణ ప్రాజెక్టులు ప్రారంభించబడినవి. ఇటీవల మధ్య రకం రాబడి వర్గాల గృహ నిర్మాణ పథకం కూడా ప్రవేశ పెట్టబడింది.

రాష్ట్రంలో షెడ్యూల్డు జాతులు, షెడ్యూల్డు కులాలు, ఇతర వెనుకబడిన తరగతులు, విముక్త జాతుల సంక్షేమానికై పెక్కు సాంఘిక సంక్షేమ పథకాలు అమలు జరుగుతున్నవి. వీటికి ఏటా దగ్గరగా రూ. 3 కోట్లు ఖర్చు అవుతాయి.

రాష్ట్రంలో నాన్‌గెజిటెడ్ ఉద్యోగుల విషయాన్ని పరిశీలించడానికి వేతనాల సంఘం ఒకటి ఏర్పాటు చేయబడింది. దాని సిఫార్సులనేమి, అటు తరువాత మంత్రులతో ఏర్పడిన ఉప సంఘం సిఫార్సులనేమి అనుసరించి ప్రభుత్వం ఉద్యోగులకు సౌకర్యాలు కలుగజేసింది. ఇందువల్ల ప్రభుత్వ వ్యయం రమారమి రూ. 4 కోట్లు హెచ్చగలదు.

హాస్య నాటిక:

# డెవలప్‌మెంట్ బ్లాకులో గిరీశం

రచన:— 'వాణీకుమార'

పాత్రలు :— గిరీశం, వెంకటేశం, పి. ఏ. బుచ్చమ్మ

[నవ్యాంధ్ర సాహిత్యంలో మరపురాని వ్యక్తి గిరీశం. ఆనాడు "డామిట్, కథ అడ్డంగా తిరిగింది" అని నిష్క్రమించిన తరువాత తిరిగి ఇన్నాళ్లకు ఆంధ్ర దేశంలో అడుగుపెట్టాడు. ఆ రావడం కూడా డెవలప్‌మెంట్ బ్లాకులోకి వచ్చాడు. అంతా కొత్తగా అనిపించింది. అతని పూర్వ కథా వృత్తాంతం దృష్ట్యా, ఇప్పుడతను ఎలా ప్రవర్తిస్తాడా అన్నదే ఈ నాటికలో చూపదలచిన అంశం. ఈ ఊహ మాత్రమే నాది కాని, నాటికారచనకు ఆధారమూ, ప్రేరణా, వక్తృత్వమూ కీ.శే. గురజాడ అప్పారావు పంతులుగారి 'కన్యాశుల్కం' నాటకమే కలిగించింది. ఇది ఆ మహా నాటకకర్త పుణ్యస్మృతికే అంకితం.— రచయిత]

స్థలం :— అగ్రహారం అంతదూరాన కన్పిస్తూవుంటే దారిలో — (గిరీశం ప్రవేశిస్తాడు)

గిరీ :- (స్వగతంగా) అన్నా, కాలు ముందుకు వేసినా మనస్సు వెనక్కి లాగి ఏమీ తోచకుండా వుంది. ఒక్కమారు విజయనగరం వెడితే ఎంత బాగుండు! ఆ బొంకుల దిబ్బ, ఆ మెట్టు, పూటకూళ్లదాని ఇల్లు, మధురవాణి ఇంట్లో ఆ గదీ ఏం జ్ఞాపక మొస్తున్నాయి. స్వీట్ మెమరీస్ అంటారే, ఇవే నేమో. మళ్ళీ ఆ చాయలకి వెళ్ళనే లేదు. ఏం వూరు! ఏం మనుషులు! మరుద్దామన్నా మరువ గలనా. కాని ఎలా వెళ్ళడం? వెధవ్వి లక్షతొంభై కమిట్‌మెంట్సు వున్నాయి. పూటకూళ్ళమ్మకి సంత లో సామాను కొనిపెడతానని డాన్సింగ్ గరల్సు కింద ఖర్చు పెట్టాను. ఎలాగో మంచం కిందికి దూరి దాని చీపురుకట్ట దెబ్బలు రామప్పంతులికి దఖలుచేసి అక్కణ్ణించి బైటపడి బేహద్బీ తప్పించు కున్నాను. సానిదానితో కలిసి తీయించుకున్న ఫొటోకి ఆ ఫొటోగరాఫ్ పంతులికి డబ్బే యివ్వ లేదు. వాడు పంపిన బంట్రోతు ముందు చెవిటి నాటకం ఆడి, హవానా చుట్టలు రెండు కట్టలిస్తానని వాడికో తస్సా వేసి ఆ గండం తప్పించుకున్నాను. కస్బాలో ఎటు చూసినా బాకీలే. అవన్నీ వడ్డీలతో సహా ప్రత్యక్షం కావచ్చు. వెంకు పంతులుగారి కోడలికి రాసిన లౌలెటర్ రిజల్టు ఏమైందో తెలీదు గాని ఎప్పుడో దేహశుద్ధి చేస్తారన్న ఎక్సుపెక్టేషన్ మాత్రం ఇప్పటికీ పీడిస్తూ వుంది. కాబట్టి లాభం లేదు. పర్యాద కాపాడమని మనస్సుకు బుద్ధిచెప్పు కొని కోరిక్కి కళ్లెం వేసి పేషెన్సుతో వుండడం తప్ప తొందరపడి కార్యం లేదు. శాంతం భోషాణ ప్పెట్టె. ఔరా! ఈ అగ్రహారం ఎంత మారి పోయింది. గుర్తుపట్ట శక్యం గాకుండా వుందే. వెనకటి దుబ్బులూ, కంపలూ, డొంకలూ, గోతులూ

ఏమీ లేకుండా సరాసరి హైరోడ్డు పడిపోయిందే! కసకనే మార్పునేది క్రియేషన్—అనగా సృష్టిలక్షణ మని థియాసఫిస్టులు చెప్పారు. ఎవరా వస్తున్నది? నా ప్రియ శిష్యుడు వెంకటేశ్వర్లులా వున్నాడే. అలనాడు నేనేదో కోసినట్లు వీడికి గుణుపురం తాశీల్దారీ అయి యేజన్సీ కమానుకెళ్లి వస్తున్నాడా యేమిటి! కాదులే, తాశీల్దారీ అయితే ఏ జీపు మీదనో టూరింగేస్తాడు కాని ద్విచక్రి శకటం ఎందుకుంటుంది? వెధవాయి ఊరు బింకి, జామి పండ్లు, చేగోడీలూ, పులుసటుకులూ తిని మా బాగా తేలాడోయ్. నా తర్ఫీదులో వున్నప్పుడు కాయగా పంచా. తెల్ల చొక్కాయీతో వుండేవాడు. ఇప్పుడు ఇన్‌షర్టూ, పాంటూ మానీటుగా తయారయ్యా డోయ్! కాని వీడి సిస్టర్ని లేవదీసుకెళ్ళానని లోప లేమైనా గ్రిడ్జీ వుండొచ్చా. యెవటపడితే నన్ను తిన్నగా ట్రీట్ చేస్తాడో లేదో. వెధవ్వి, బొంకుల దిబ్బ వొదిలించగర్నుంచీ అన్నీ సందేహాలే. పరవా లేదు, అట్నుంచి నరుక్కు రమ్మన్నాడు. అయినా విధవా వివాహాలను గూర్చీ, రిఫార్మును గూర్చీ అతగాడికి మనమిచ్చిన లెక్చర్లన్నీ వృథా పోయ్యాయనిఅనుకోను. అదీకాక వాళ్లింట్లో దొడ్లో జామిచెట్టు కింద నేనూ వాళ్లప్పా కష్టసుఖాలు మాట్లాడుకోవడం అతనెరగని సంగతా. పెళ్లికి తర్లి వెళ్ళుతోన్నప్పుడు నిశిరాత్రి అతన్ని ఏను గెక్కించి నేనూ వాళ్లక్కయ్యా బండిలో కూర్చున్న సంగతీ అతనెరుగునే. అయినా కీడెంచి మేలెంచ మన్నాడు. మనకై మనం బైటపడకూడదు. అత గాడు వచ్చి శ్రద్ధగా పలకరించేటట్లు నటిస్తాను పెర్‌ఫెక్టు స్ట్రేంజర్ వేషం వేయడం ఇప్పటికి శ్రేయస్కరం. (తువాలు తలమీది నుంచి మొహం మీదికి తిప్పుతూ) చెహరా మార్చేశాను. మనం యేదైనా వేషం వేశామంటే ఒకడు చూస్తాడని అనుకున్నప్పుడూ, ఒకడు చూడలేడనుకున్నప్పుడూ కూడా ఒక్క మోస్తరుగా వేషం నడిపిస్తే సేఫ్ సైడ్; కాబట్టి బహుపరాక్!

(వెడుతూవుంటాడు)

వెంక:- ఏమండోయ్

గిరీ :- (పలకడు, పోతూ వుంటాడు)

వెంక:- ఏమండోయ్, మిమ్మల్నే. కొంచెం నిలవండి.

గిరీ :- తొందర పనుంది. వేగం వెళ్లాలి; సంగతేమిటో చెప్పు.

వెంక:- అరే! మీరా!!

గిరీ :- మీరా అంటావేమిటి, పొరపాటు పడ్డావేమోఅబ్బీ. మనిషిని పోలిన మనిషి ఎక్కడైనా వుంటాడు.

వెంక:- ఏమిటీ, మా గురువుగారిని పోలిన మనిషా! ఈ లోకంలోనా!

గిరీ :- ఏం అంత గ్రేట్‌మానా మీ గురువుగారు?

వెంక:- గ్రేటూ, గ్రేటెస్ట్ ఆఫ్ ఆల్. యావదాంధ్రిలోనూ, ఆ మాటకొస్తే యావద్భారతంలోను ఆయనకా యనే సాటి.

గిరీ :- సరే. మీ గురువుగారి సొద నాకెందుకు చెబుతా వులే గాని నా దారిని నన్ను పోనివ్వు.

వెంక:- మిమల్నిపోనిస్తే ఇంకా మా గురువుగారేమిటండీ?

గిరీ :- అయితే నన్ను పరకాయ ప్రవేశం చేయమన్నావా ఏమిటి?

వెంక:- అక్కర్లేదు, దయచేసి తమరు నిజం ఒప్పుకుంటే చాలు.

గిరీ :- ఇదిగో అబ్బీ, ఏమైనా సహించ గల్ను కాని అసత్యమంటే సహించలేను. ఏబ్‌స్ట్రాక్టు ట్రూత్-అనగా శుద్ధ సత్యమనేది సాక్షాత్తూ భగవంతునితో సమానమైన వస్తువు అన్నమాట ఈ భూ ప్రపం చంలో వుండేవారెవరూ మరచి పోకూడదని నా అభిప్రాయం. నేను మట్టుకు నిజం కోసం సమ యం వొస్తే సంతోషంతో ప్రాణం యిచ్చేస్తాను.

వెంక:- ఆఁ అదిగో దొంగ దొరికి పొయ్యాడు. దొరి పొయ్యారో.

గిరీ :- ఎవరయ్యా?

వెంక:- మా గురువుగారే నండీ.

గిరీ :- ఏవిటీ దాఖలా?

వెంక:- ఇంకా దాఖలా ఏమిటండీ, ఆ మనిషిని కానని అస త్యమాడుతూ కూడా సత్యాన్ని గూర్చి అలా లెక్చ రిచ్చే దమ్ములు ఎవరి కున్నాయండీ. ఇప్పుడంటే అన్నారు గాని ఇహ అనబోకండి. నేను ఇన్నాళ్లూ

మీరు ఎక్కడా అని అహర్నిశలూ వెదుకుతూ వున్నాను. ఈ నాటికి నా అదృష్టమా అని దొరికేరు.

గిరీ :- ఇంతకూ నేను ఎవర్నంటావ్.

వెంక:- ఎవరేమిటండీ. మహారాజరాజశ్రీ యస్. గిరీశం పంతులుగారు. పూర్వాశ్రమంలో అస్మద్గురువరేణ్యులు. ఇహ నన్ను కాదనకండి. ఈ శిష్యుడి సాష్టాంగ దండ ప్రణామాలు స్వీకరించి ఆశీర్వదించండి.

(సాష్టాంగం పడతాడు)

గిరీ :- భేష్, నీ భక్తికి మెచ్చాను (శిష్యా.—అతన్ని లేవదీస్తూ—) ఏమివాయ్, మైడియర్ షేక్స్పియర్, శిష్యుడివంటే నువ్వోయి. అనాడే అనుకున్నాను. ఐడియల్ ప్యూపిల్ ఐడియల్ డిసైపిల్ అంటే వెంకటేశమేనని. ఈ నాటి శిష్యుల్ని చూస్తూన్నాగా మేష్టారు ఎదురయ్యాడంటే పరధ్యాన్నం నటించి తప్పించుకు పోతారు. నిన్ను యామని దీవించాలో బోధపడకుండా వుందోయ్. పుత్ర పౌత్రాభివృద్ధిరస్తు అనాలా, శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తు అనాలా ? మేరేజ్ చేసుకున్నావా లేక బాచిలర్‌గానే వున్నావోయ్ ?

వెంక:- నా పెళ్లి మీచేతి మీదుగానే కావాలని ఇలాగే వుండి పొయ్యానండి.

గిరీ :- చూశావా, గురుభక్తంటే ఇలా వుండాలి. ఉపనిషత్తులో చెప్పిన శిష్యుళ్లాంటి శిష్యుడివి నువ్వు. అలాంటి గురువుని నేను. ఐతే చెప్పావు కావు, ఏ గరల్ నైనా ప్రేమించి రెడీగా వున్నావేమిటీ ?

వెంక:- (ముసిముసి నవ్వుతాడు)

గిరీ :- సిగ్గు పడుతున్నావటోయ్. సర్లే, ఆ అమ్మాయి మేడనా, విడోయా ?

వెంక:- విడోయేనండి. ఆనాడు మీరు, నువ్వుకూడా యంగ్ విడోని పెళ్లాడక పోతే ఐషుడ్బీ ఎషేమ్డ్ ఆఫ్ యూ అన్నారు కదండీ. అందుకేగా విడో మేరేజీని గూర్చి వీరేశలింగం పంతులుగారు వ్రాసిన ఉపన్యాసం నా చేత భట్టీయం వేయించారు.

గిరీ :- విధేయతంటే నీదోయ్. ఇంతకూ ఎవరా పిల్ల ?

వెంక:- నా కొలీగండీ.

గిరీ :- కొలీగంటున్నావ్, నువ్వు ఉద్యోగం చేస్తున్నావటోయ్.

వెంక:- మరేం చేయనండీ. ఉద్యోగాలంటే మీ కిష్టం లేదన్న మాట నాకు తెలుసు. కాని చెయ్యడానికి మరేమీ లేక పోయింది.

గిరీ :- ఏమీ లేకపోవడమేంటోయ్. రిఫార్మ్ లేదూ ? విడో మేరేజీలూ నాచ్చికొళ్ళనూ లాంటి సమస్యలేమీ లేవూ.

వెంక:- ఇవన్నీ ఇప్పుడంత పెద్ద సమస్యలు కావండీ.

గిరీ :- పెద్ద సమస్యలు కావూ ! టుమేరీ ఏ విడో ఆర్ నాట్ టు మేరీ అని ఎన్నాళ్లు తన్నుకు చచ్చానోయ్. ఇప్పుడు ప్రాబ్లమే కాదంటావేమిటీ.

వెంక:- అవునండీ. ఇప్పుడవేమీ సమస్యలు కావు. ఇష్టమైన విడోలు స్వేచ్ఛగా పెళ్లిళ్లు చేసేసుకుంటున్నారు. పెద్దవాళ్ల అభ్యంతరాలు ఆట్టే లేవు. ఇహ నాచి కొళ్ళనంటారా. వాళ్లకే అది తలవంపులుగా వుంది. పైగా ఇమ్మొరల్ ట్రాఫిక్ రూల్సు వుండనే వున్నాయి. అందుచేత వేశ్యలు కూడా పెళ్లిళ్లు చేసేసుకుంటున్నారు.

గిరీ :- ఛా ఛా, ఎంత పని జరిగిందోయ్, అందుకే సమస్యలు వుంటం కోసమే ఒకప్పుడు ఇన్ఫాంటు మేరేజీలు కూడుననే తోస్తుంది అన్నానోయ్. రిఫార్మ్‌కి అవకాశం లేకపోతే సివిలిజేషన్ హాల్టవుతుందోయ్. సొసైటీలో ప్రాబ్లమ్సు అంటూ లేకపోవడం ఎంత న్యూసెన్సు, ఎంత ఇనెర్షియా !

వెంక:- ఎందుకు లేవండీ, ఇప్పటి ప్రాబ్లమ్సు ఇప్పుడున్నాయి.

గిరీ :- అయితే ఏమిటో వెంటనే యాకరువు పెట్టు వాటి నిగ్గేమిటో తీస్తాను. కుంచం నిలువుగా పెట్టి కొలవడానికి వీల్లేనప్పుడు పడగేసైనా కొలిస్తే నాలుగ్గింజలు నిలుస్తాయి. మన కత్తికి రెండు వైపులా పదునుంది. సరే గాని ఇంతకూ మొదట నీ ఉద్యోగమేమిటో క్లుప్తంగా చెప్పేసెయ్యి.

వెంక:- నేను ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు.........

గిరీ :- (అర్ధోక్తిలోనే అందుకుంటూ-) ఆంధ్రప్రదేశ్ ఏమిటోయ్? కళింగరాజ్యం, సీమదొరల గవర్నమెంటు యామైనట్టు?

వెంక:- సీమదొరలు వెళ్లిపోయి పుష్కలం కావస్తూందండీ.

గిరీ :- ఏమిటీ! నేషనలు కాంగ్రెసు దెబ్బకేనా!

వెంక:- మరేనండీ, మనదేశం ఇండిపెండెంట్ ఐపోయింది.

గిరీ :- చూశావా, ఆ రోజుల్లో నేషనల్ కాంగ్రెసు పేరు చెబితే దేవుడు కూడా హడలిపొయ్యే వాడోయ్. గ్రేట్ పీపిల్ అంతా అందులోనే వుండేవాళ్ళు, ఇక తెల్లాడి మాట అడగాలా, వీళ్ల దెబ్బ లావుగా వుందని చెప్పి తీసుకోండబ్బాయ్ మీ దేశం మీరు అని కిత్ అండ్ కిన్‌తో సీమకు వెళ్లిపోయుంటాడు.

వెంక:- మారె, కాంగ్రెసు మంత్రి పర్గాలు కూడా ఏర్పడి పొయ్యాయండీ.

గిరీ :- అయితే నేషనలు కాంగ్రెసంటే దివాన్గిరీ చెలాయించడంగా స్థిరపడిపోయిందన్న మాట రైట్, మన ఆశయాల్లో ఒకటి నెరవేరినట్లు కన్పిస్తూ వుంది. ఇక పోతే ప్రదేశ్ అన్నావ్, అదేమిటీ?

వెంక:- అవునండీ, యావదాంధ్రమూ ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందికి వొచ్చేసింది. హైద్రాబాదు రా జ ధా ని ఐపోయింది.

గిరీ :- హైద్రాబాదే, ఇంతసేపూ చెప్పావుకావోయ్. ఆ పేరు నాకు కృతపరిచితం. పూర్వం మా నేస్తం నవాబ్ సదరదాలత్ బావంలీఖాన్ ఇస్ఫహాన్ జంగ్ బహదూరు వారు సిఫార్సు చేసి వెయ్యి సిఖా రూపాయల మీద ముసాయబ్ ఉద్యోగం వేయించాడోయ్ అక్కడ. నైజాం వారి ఫర్మానా కూడా వొచ్చింది. కాని నీ ఉద్యోగ మెవడిక్కావాలని తిరగ్గొట్టానోయ్. నేనెప్పుడో అనుకున్నాను, తెలుగువాడన్న వాడికి నైజాం హైదరాబాదే ముఖ్యపట్టణమని.

వెంక:- మాటవరస కడుగుతాను. నిజమేనండీ ఆ ఉద్యోగం సంగతీ!

గిరీ :- ఆబ్‌స్ట్రాక్టు ట్రూతోయ్, దానికి మళ్ళీ కొశ్చనేస్తా వేమిటీ?

వెంక:- ఓహో, అదా !

గిరీ :- ఊఁ, ఇహ చెప్పు నీ ఉద్యోగమేమిటన్నా.వ్

వెంక:- డెవలప్‌మెంటు డిపార్టుమెంటులో విలేజ్ లెవల్ వర్కరుగా కుదురుకున్నానండీ.

గిరీ :- పోనీలే ఇది కూడా రిఫార్ము తాలూకు పనే గాని డస్కు ముందు కూర్చొని బల్లక్రింద చెయ్యేట్టేది కాదుగా. ఆఁ, రిఫార్మంటే జ్ఞాపకమొచ్చింది; ఇప్పుడు మన సమస్యలేమిటో వున్నాయన్నావు, అవి కాస్త చూచాయగా చెప్పు. జస్టు ఇంటర్డిక్షనీజ్ ఇనఫ్‌ఫర్మీ. చాంతాడంత వ్యాఖ్యానం అక్కర్లేదు.

వెంక:- అలాగేనండీ, దేశం ఇండిపెండెంటయి పోయిం తరువాత దీన్ని ఎలా వృద్ధి చెయ్యాలా అని నేషనల్ లీడర్సంతా కొట్టి మిట్టాడారు. ఆఖరికి డెవలప్ మెంటు తల పెట్టారు. అందుకు కమ్యూనిటీ డెవలప్ మెంటు సాధనంగా దొరికింది. అక్కణ్ణించి పంచవర్ష ప్రణాళికలతో, సామాజికాభివృద్ధి ఉద్యమంతో, ప్రజా సహకారంతో దేశం ముందుకు పోతూంది. అప్పుడే ఒక ప్ర ణా ళి క సమాప్తమై, రెండోది కూడా సగం అయిపోయిందండీ.

గిరీ :- చూశావా, నీకు కూడా లెక్చర్ అ బ్బిం దో య్. రిఫార్ము మాట బుర్ర కెక్కితే సరి, తెలివి దానంతటదే పాకి పోతుంది. ఏయిమ్ అనేది వుంటే ఎలోక్వెన్సు ఎలాగూ ఏర్పడుతుందోయ్. సరే, ఇదా సంగతి, కనకనే ఎక్కడ విన్నా డెవలప్ మెంటు అన్నమాట చెవిని పడుతూ వచ్చింది. సరే, దాని సంగతి తరువాత కనుక్కుందాం. ముందు మన కష్ట సుఖాలు చెప్పుకుందాం పట్టు. సిగార్ యామైనా వుందా చూడు.

వెంక:- ఇప్పుడా అభ్యాసం లేదండీ.

గిరీ :- ఏం నిషేధమా ?

వెంక:- ఎబ్బే. దాని కింకా నిషేధం రాలేదండీ,

గిరీ :- మరి దేనికైనా వొచ్చిందేమిటీ ?

వెంక:- మద్యపాన నిషేధం వొచ్చిందండీ,

గిరీ :- అయితే మన గవర్నమెంటు వారు ఖాయిదాగా పరిపాలన సాగిస్తున్నారన్నమాట. మద్యపాన నిషేధం వల్ల మనకిబ్బందేమీ లేదు. పైగా బీదా బిక్కీ బాగు పడతారు. పొగ చుట్టను నిషేధిస్తేనే నాకు లావు చిక్కు అంతే కాదు, మన టొబాకో పనిషత్తుపై బాన్ కూడా రావచ్చు. మరి నువ్వు సిగార్ ఎందుకు మానేసినట్లు ?

వెంక:- నేచేసే పనికి అలాంటి అభ్యాసాలు మంచివి కావని అనుకున్నానండీ.

గిరీ :- అవున్లే. నా కొక్కడికీ మినహా, రిఫార్మర్లకు వ్యసనాలుంటే వ్యవహారం సాగదు.

వెంక:- మరేనండీ.

గిరీ :- ఈ చేతిలో వుంది సరిగా కాలకండా వుందోయ్, మరో సమిధె వెలిగిస్తాను(-చుట్ట వెలిగించి-) ఆఁ. ఇహ చెప్పు. మీ సిస్టర్ సంగతి యామైనా తెలిసిందటోయ్.

వెంక:- నాకెలా తెలుస్తుందండీ. మీరుకదూ తీసుకు వెళ్లారు.

గిరీ :- అరాజిమెంటుతోనే తీసుకెళ్ళానోయ్. అనకాపల్లి రోడ్డు నుంచీ రామవరందాకా మా స్నేహితులు అంచీబళ్ళు బణాయించి క్షేమంగా తీసుకెళ్ళారోయ్. కాని వెధవ ఇంతోటి రామవరంలో పెళ్ళేమిటీ, పెద్దలందరి సమక్షంలోనే చేసుకుందామని విశాఖ పట్టం చేరుకున్నామోయ్. అక్కడ డామిట్, కథ అడ్డంగా తిరిగింది.

వెంక:- ఏవైందేమిటి?

గిరీ :- ఆ వూళ్ళో సౌజన్యారావు పంతులుగారని జాన్సన్ లాంటి ఓ పెద్దమనిషున్నాడోయ్. అక్కడికీ నేచర్ కనిపెట్టి వెంటనే ఆయనకీ ఓ తస్సా వేశాను. కాని పారలేదు. అక్కడికా బ్యూటిఫుల్ నాచ్ డెవిల్ వొచ్చి కూచుంది.

వెంక:- డెవిలెవరండీ?

గిరీ :- అదేనోయ్, మధురవాణి.

వెంక:- ఆహాఁ, సానిదాండీ.

గిరీ :- ఊఁ, దానిదగ్గర నుంచి ఆయన నా రిపోర్టంతా లాగి నేను ట్రూ రిపెంటెన్సు ప్రకటించి మెర్సీక్రేవ్ చేసినా చెవిని పెట్టకుండా మీ సిస్టర్ని పూనాలో విడోస్‌హోమ్‌కి పంపించారోయ్! ఇహ నేంచేయను.

వెంక:- మధ్య ఆయన దఖలేమిటండీ?

గిరీ :- ఆయన కూడా రిఫార్మరోయ్. ఎదిరిద్దామని చూచా కానీ. ఇన్‌ఫ్లుయెన్సు కలవాడోయ్. ఆయన మాటెత్తితే ప్రతివాడూ తగ్గుతాడు. గనక స్థాన బలిమి లేకా, నీలాంటి శిష్యులెవరూ దొరక్కా సర్వమూ ప... ంచు కొన్నాను,

వెంక:- మరి ఆ తరువాత?

గిరీ :- ఇదిగో చూస్తున్నావుగా, దేశ సంచారం. సరేగాని మన వాళ్లంతా ఎక్కడెక్కడున్నారో నీకు తెలుసోయ్.

వెంక:- ఎవరంటారు?

గిరీ :- ఆ దుర్మార్గుడు రామప్పంతులోయ్.

వెంక:- ఆయనా, ఈ డెవలప్ మెంటు వొచ్చింతర్వాత ఈ ప్రాంతాల్లో లిటిగేషన్సేవీ దొరక్క హైకోర్టు హైద్రాబాదులోనే వుందని, అక్కడే జట్టీలు చూచుకుంటానని వెళ్లారండీ.

గిరీ :- వాడికి బహువచన ప్రయోగం చేస్తావేమిటోయ్. ఎదటే ఏకవచన ప్రయోగం చేసే వాళ్లం. దానికి వాడి కాష్టవాదం. వాడికి బుద్ధి సత్తువ వుంది గాని చేయి ముట్టు సరసఏంటే మాత్రం కరచరణాలు ఆడేవి కావు, నేనంటే మాత్రం హడలి పొయ్యేవాడు. పైకి నా ఇంగ్లీషును బొగ్గేలు ముక్కలనే వాడు గాని, దొరల్లాగా ఇంగ్లీషు మాట్లాడతానని వాడికి లోపల దొబ్బు. సరేగాని, కూడా మధురవాణి వెళ్లిందటోయ్,

వెంక:- మధురవాణా! ఆమె రిఫార్మ అయిపోయించండీ.

గిరీ :- పోనీలే, ఆ వెధవ రామప్పంతులు స్వాధీనం నుంచి తప్పి పోయింది. నాకు కావలసిందీ అదే. పోతే ఎక్కడుందంటావిప్పుడు?

వెంక:- సోషల్ వెల్ఫేర్‌లో పని చేస్తూందండీ.

గిరీ :- రైట్, దానికి తగిన పని దొరికిందోయ్. సరసుల్ని దాస్తూవుండేది గాని, మనిషి నాకు ఒక విధంగా వచ్చిందోయ్. డబ్బు కంటె మెప్పుకోరే మనిషోయ్ అదీ.

వెంక:- అలాగండీ!

గిరీ :- పోనీలే, అది వేరే కథ. ఏమైతేం దేశంలో నాచీ క్వొశ్చన్ లేకుండా పోయింది. మరి మీ అమ్మా నాన్నా కులాసాయేనా?

వెంక:- అలాగే వున్నారండీ.

గిరీ :- మీ నాన్న జటాంతస్వాధ్యాయి కథా, దరిమిలా మనిషేమైనా మారాడోయ్? మీ అమ్మ సాక్షాత్తూ అరుంధతోయ్. ఆమె మనస్సు కష్టపెట్టాను.

వెంక:- వాళ్లంతా ఎక్కడ మారతారండీ, పైగా నాకు మున సబీ కాలేదని వాళ్లకు పెద్ద అసంతృప్తి.

గిరీ :- వాళ్లతరం అలా గడచి పోనీలే, మరి మీ సిస్టర్ ఈప్రాంతాలకేసి ఎప్పుడైనా వొచ్చిందా.

వెంక:- అదిగో బ్లాకు క్వార్టర్సు దగ్గరికొచ్చేశాయండీ, మీరే మాట్లాడుదురు గాని రండి.

గిరీ :- (మంచి ఉత్సాహంగా—)ఏమిటీ! మీ సిస్టర్ ఇక్కడే వుందటోయ్! ఇందాకటి నుంచీ ఎంత సస్పె న్సులో పెట్టావోయ్. వాటె ట్రెమెండస్ న్యూస్, మై హార్టు లీప్స్ విత్ జోయ్! మై స్వీట్ హార్టు, మై హార్టు త్రాబ్, మై రేజ్. ఈ వార్త వినే సరికి ఎంత సత్తువ వచ్చేసిందోయ్! అందుకే మన వాళ్ల న్నారు సంతోషం సగం బలమని. ఏదీ త్వరగా పదా. మీ సిస్టర్ని చూడందీ నేనీ ప్రకృతిలో మరి దేన్నీ చూడదలచుకోలేదు. వేగిరం పదా శిష్యా.

వెంక:- రండి, ఇదిగో ఇదే మా క్వార్టర్.

గిరీ :- నేషనల్ గవర్నమెంటు వారు మా బాగా కట్టేరోయ్ ఇండ్లన్నీ. పదా, లోపలికి దారి తీయి.

(లోపలికొస్తారు)

(బుచ్చమ్మ పేము కుర్చీలో కూర్చునుంటుంది.)

గిరీ :- (ఉద్వేగంతో)-వొదినా, మీరు ఇక్కడా! హౌ బ్యూటిఫుల్, క్వైటనెక్స్పెక్టెడ్! అబ్బ. పునర్జన్మ ఎత్తినట్లుగా వుంది. వొదినా, మీ కోసం దేశ మంతా ఎంత గాలించాను. ఎన్ని పాట్లు పడ్డాను. ఎంత ఘోష చెందాను. చివరికి డెవలప్ మెంట్ వారి పుణ్యమా అంటూ ఇక్కడ నీ దర్శనం చేసు కున్నాను. చీకటి రాత్రిలో చంద్రోదయం లాగ శూన్యమైపోయిన నా జీవితంలోకి వసంత శోభ వొచ్చినట్టుంది. అయాండి మోస్ట్ ఫార్చునేట్ మాన్-నా అంత ధన్యుడు లేడు వొదినా.

బుచ్చ:- (తెలివిగా నవ్వి)-మొత్తానికి మనిషేమీ మారలేదు.

గిరీ :- మీలాంటి దివ్య సుందర విగ్రహం గుణవంతురా లైన మనిషికి హృదయం ఇచ్చేశాక ఎలా మార తాను వొదినా, ఎవరెకు మగ్దూర్ వుంది నా మనస్సు మార్చడానికి.

వెంక:- సరే, గురూ, మీరు మాట్లాడు కొంటూ వుండండి. నేను కాఫీ ఏర్పాట్లవీ చేసొస్తాను.

గిరీ :- అలాగే, గో ఎవే మై గుడ్ బోయ్. నాకు నువ్వే ఆసరా, నా మంచి చెడ్డలు కాస్త కనిపెట్టి వుండు.

(వెంకటేశం వెళ్లి పోతాడు)

గిరీ :- (బుచ్చమ్మకు దగ్గరగా వచ్చి)-ఎలా మారతాను వొదినా. నీ చక్కదనం, నీ సొంపూ చూచి నన్ను నీకు అంకితం చేసుకున్నాక మళ్లీ మారడం కూడానా. నీకోసం ఎన్ని కలలు కన్నాను, ఎంత మంది రంభా ఊర్వశీ మేనకా తిలోత్తమలను తన్ని తగలేశాను, అబ్బ నిన్ను చూస్తోంటే ... ...

(దగ్గరకు పోబోతాడు)

బుచ్చ:- అహహా......—(వొసిలి తప్పించు కుంటుంది)

గిరీ :- వొదినా మీరు చాలా మారి పోయినట్టు కన్పిస్తారు,

బుచ్చ:- ఏమిటా మార్పు ?

గిరీ :- అప్పుడు యంగ్ అండ్ బ్యూటిఫుల్ విడోలాగా జెరుకు బెరుగ్గా, మృదువుగా మాట్లాడే వారు. బెదిరిన లేడి చూపులతో ఆ జామి చెట్టు క్రింద మీరు నిల్చొనుంటే వనలక్ష్మిలా అనిపించేవారు.

బుచ్చ:- (నవ్వి) మరి ఇప్పుడో.

గిరీ :- ఇప్పుడెంత చురుకుదనం, ఏం వయ్యారం. ఏం ఫాషన్. ఏం మార్పు, ఏం గిర్పూ. (-గది అంతా కలయ జూస్తూ-) అబ్బ, నీగదికూడా లౌలీ మేడెన్ గదిలా వుంది, వొదినా. ఒహ్ పియర్సు సబ్బూ, పౌడరు గుండ, వాసన నూనెలు—ఇవన్నీ నాబోటి రసికుల నాకర్షించే పరిమళాలు. అబ్బ. నీ చీరె కూడా స్నోవైట్ ఖాదీ, పొడుగు చేతుల జాకెట్లూ వాట్!

బుచ్చ:- ఏం, మీ కిష్టం లేదా ఇవన్నీ?

గిరీ :- ఇష్టం లేక పోవడమేంటీ, మీరు ఎలా వున్నా నా కిష్టమే. ఆ సౌజన్యారావు మహాశయుడి వల్ల వ్యవహారం మొదటికొచ్చి మోస్ట్ అన్ఫార్చునేట్ క్రీచర్ నయ్యాను గాని లేకపోతే ఏం మహర్దశ పట్టవలసింది నాకు.

బుచ్చ:- ఆయన నా పాలిటి దేవుడిలా ప్రత్యక్షమై నన్నీ స్థితికి తీసుకొచ్చారు. వారుచేసిన మేలు నేనెన్నటికీ

మరచిపోలేను.

గిరీ :- నీ పాలిట దేవుడైతే నా పాలిట దౌర్భాగ్యుడు. ప్లానంతా భగ్నం చేశాడు. చూశావా వొదినా, నీలో నిజంగా మార్పొచ్చింది. నీ సంగతి నువ్వు చూసు కున్నావు గాని నా అతీగతీ కనుక్కున్నావా.

బుచ్చ:- ఏం? మీ అన్నగారు మిమ్మల్ని దత్తుతీసుకోలేదా ?

గిరీ :- దత్తా, ఆ త్వాష్టౄరిడా, దత్తత పత్రిక కాదుగదా ఓ పపెరాఫ్ ఎటార్నామా కూడా వ్రాశేశ్చాడు కాడు.

బుచ్చ:- పోనీలెండి మా చెల్లెలి పెళ్లి మాత్రం తప్పి పోయింది. అదే పదివేలు.

గిరీ :- మరి తప్పించాము, లోకోపకారం కోసమే కదా ఈ గిరీశం జీవితమంతా. అ మాటకొస్తే మనిద్దరం ఆ నాడు లేచి రాబట్టే గదా నీలో ఈ మార్పొచ్చింది. మనం చేసినపన్నీ ఉపకారాలే. అడగడం మర్చాను చిన్నది ఇప్పుడు ఎక్కడుందేవిఁటీ?

బుచ్చ:- దానికి తగిన వాణ్ణి చూచుకొని లౌమేరేజి చేసు కుంది.

గిరీ :- భేష్, మంచి పని చేసింది. ఇన్నాళ్లకు విన్నాను. లౌమేరేజి అన్న ముక్క. ఎంత ఉత్సాహంగా వుంది! అయితే అంతా ఎవరికి వాళ్లు బాగానే వున్నారన్న మాట.

బుచ్చ:- అంతా అంటున్నారు, ఎపరెవరో.

గిరీ :- ఆదే మన జనమంతా. మన వెంకటేశం సంగతి కూడా సెటిలైపోయిందని ఇప్పుడే విన్నా.

బుచ్చ:- ఇంకా?

గిరీ :- ఇంక మీ సంగతి మీరు నాకు చెప్పాలి. నా సంగతి నేను మీకు చెప్పాలి. ఇద్దరి అభిప్రాయాలూ కల బోసుకోవాలి,

బుచ్చ:- అభిప్రాయాలు కాదు, అనుభవాలు చెప్పండి, వింటాను.

గిరీ :- బ్రహ్మచారికి నాకేం అనుభవాలుంటాయి వొదినా. సత్రా భోజనం, మఠా నిద్రా. ఏదో రోజులు గడుపు కొంటూ నిన్ను వెదుకుతూ తిరుగుతున్నా.

చ్చబు:- అంతేగాని, పైచదువూ, ఉద్యోగమూ, ఆస్తీ ఏమీ సంపాదించ లేదన్న మాట,

గిరీ :- పై పదువా. సౌజన్యారావు గారు అన్నారు గాని అది మనకు సరిపడ లేదు. నాకు చదువేంటి వొదినా? ఇక ఉద్యోగ మంటారా. మీకు ఆనాడే చెప్పాగా సంసార తాపత్రయం లేనపుడు ఉద్యోగం నేను చెయ్యననీ. పెళ్లాడింతరువాత సంసారం సుఖంగా జరగడానికి లావుగా డబ్బుండాలి కనక అప్పుడు ఉద్యోగం చేస్తాను. అసలు మన పేరు చెబితేనే ఎక్కడెక్కడి అపాయింట్ మెంట్ ఆర్డ ర్లన్నీ పడి పోతాయి. ఇహ ఆస్తి పాస్తులంటారా, మీలాంటి సువర్ణచ్ఛాయగల కుందనపు బొమ్మ వొచ్చినప్పుడు ఇల్లంతా బంగారమే కాబట్టి వాటె వూసెత్తక్కర్లేదు. ఇక మీ సమాచారం సవిస్త రంగా చెప్పండొదినా.

బుచ్చ:- ఏముందీ, సౌజన్యారావు పంతులుగారు నన్ను పూనాలో విడోస్ హోంలో చేర్పించారు. అక్కడే మెట్రిక్యులేషన్ పూర్తి చేశాను. తర్వాత విమెన్స్ యూనివర్శిటీ డిగ్రీ తీసుకున్నా. వెంటనే ఇక్కడ యస్. ఈ. వో. ఉద్యోగమైంది.

గిరీ :- అంతే ?

బుచ్చ:- సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్ అంటారు. ఈ బ్లాకులో వున్న స్త్రీల సర్వతోముఖాభివృద్ధికి పాటు పడ్డం నాడ్యూటీ.

గిరీ :- ఏమి వింత ! ఏమి చోద్యం! ఆడవాళ్లు కూడా ఇంకి యాలో రిఫార్ము పనిలో పడ్డారు. దీని అంతేవో కనుక్కోవాలి నెమ్మది మీద. భేష్, అక్కా తమ్ముడూ రిఫార్ము మార్గంలోనే వున్నందుకు నాకు మహానందంగా వుంది వొదినా. మరి నాసంగతేమి? చెబుతావ్ వొదినా.

బుచ్చ:- ఏం చెప్ప మంటారు.

గిరీ :- మనం ఆనాడు అనుకున్న మాట మీ కిష్టమైతే ఈ నాటికైనా..... . .

బుచ్చ:- ఐనా .. . స్పష్టంగా చెప్పండి.

గిరీ :- మీతో మాట్లాడేప్పుడు వొచ్చిన చిక్కే ఇది. మాట సరిగా పెకలిరాదు. ఒకటి అనవలెనని ఒకటి అనేస్తూ వుంటాను.

బుచ్చ:- యేమన వలచుకున్నారు ?

గిరీ :- అదే, మన ఉభయుల సంగతి.

బుచ్చ:- యేమంటారు.

గిరీ :- నువ్విలా క్రాస్ఎగ్జామినేషన్ చేస్తూవుంటే నే నే మన్నూ వొదినా.

బుచ్చ:- నేనేమీ అనను లెండి. మీరు చెప్పదలచుకుంది చెప్పండి.

గిరీ :- చెప్పేదేముంది వొదినా. నా మ న స్సు నీ మీద ఎప్పుడో లగ్నమైపోయింది. నువ్వు కూడా నేనేం చెయ్యమంటే అది చేస్తానని నా మీద ప్రమాణం చేసి చేతిలో చెయ్యేశావు. మధ్య అ వా ం త ర ం వొచ్చింది. ఆ అడివంతా దాటి ఇప్పుడు ఈ మైదానంలో కలుసు కున్నాము. ఇహ యే ఆటం కమూ లేదు. నా ప్రియ శి ష్యు డు వెంకటేశం కూడా మన యూనియన్‌కు సమ్మతించాడు. నీ నోటి నుంచి ముత్యాలు రాలడమే తరవాయి.

బుచ్చ:- ఆఁ ఏమోనండీ. నన్నిలా వుండనివ్వండి.

గిరీ :- చూశావా వొదినా. నువ్వు మనిషివే కాదు మారింది, బుద్ధికూడా మారి పోయింది. అ యా ం ఎ మోస్ట్ అన్ ఫార్చునేట్ మాన్. అనగా ఈ పృ ధ్వీ తలంలో నాయంత దౌర్భాగ్యుడు మరి లేడు.

బుచ్చ:- అలా ఎందుకనుకోవాలండీ.

గిరీ :- ఇంకేమనుకోను వొదినా. నా ఆశలన్నీ అడియాసలై పొయ్యాయి. నా స్వప్నాలన్నీ గాలి మేడల్లా కూలి పోయ్యాయి. నా హృ ద య ం అయ్యర్ కాఫీ హోటలు పాలలా కళవళ పడుతూ వుంది. నా మనస్సు లావా పర్వతంలా బద్దలవుతూవుంది. నా బ్రతుకే టోక్యో తుఫానులో కొట్టుకు పోతూంది.

బుచ్చ:- అయ్యో, అయ్యో, అలా ఉద్రేక పడకండీ.

గిరీ :- ఇంకా ఉద్రేకమేమిటి. ఎంత మిస్ హోప్, ఏమి ఇల్లక్. ఇక లాభం లేదు వొదినా. ఆనాడు పెరట్లో రుబ్బురోలు దగ్గర నేచేసుకొన్న ని ర్ణ య ం ఇక తక్షణం అమలు జరగాల్సిందే. యే మా త్ర ం వాయిదా పడ్డానికి వీల్లేదు. జోడుగుళ్ల పి స్తో లు యే టేబిలు సొరుగులో వుందో వెతకాల్సిందే. మరు క్షణం స్వర్గానికి వెళ్లి కల్ప వృక్షచ్ఛాయని కాషాయ వస్త్రాలతో నీ పేరు జపం చేస్తూ పద్మాసనం మీద వుండి పోవలసిందే. ఇక ఈ మా న వ లోకంలో వుండ వీల్లేదు, వీల్లేదు.

(దూసుకు పోబోతాడు)

బుచ్చ:- (వెంటపడుతూ) అయ్యో, అంతపనీ చెయ్యకండీ. అలా వెళ్లిపోకండీ, కాస్తాగండీ.

గిరీ :- (తటపటాయిస్తూ) ఊహూ, వెళ్లి పోవాల్సిందే, నన్నాపకండి వొదినా.

బుచ్చ:- అయ్యో, నిలవండీ. అలా పోతారేం.

గిరీ :- (ఆగి) మరేం చెయ్యను వొదినా. మీరు లేక పోయింతరువాత నాకీ ప్రపంచంతో యేం నిమిత్తం?

(ఆకాశంకేసి తిరిగి) మైగాడ్ ఎక్కడున్నావయ్యా, నీ సృష్టి ఇలా ఛిన్నాభిన్నమై పోతుంటే, హార్మనీ ఎక్కడేడిసిందయ్యా, మై హార్టు బ్రేక్స్. అయాం డెడ్‌ఫుల్లీ ఇన్ లౌ విత్ హెర్! ఐ కాంట్ లివ్ వితౌట్ హెర్, ఓహ్, మిజరెబుల్.

బుచ్చ:- ఇటు నాతో మాట్లాడండి.

గిరీ :- ఏం మాట్లాడను వొదినా. నిన్ను పెళ్ళాడాలా వొద్దా అని ఎంత తపన పడ్డాను. లాభ నష్టాలు బేరీజు వేసి, జమా ఖర్చు చేసుకొని ఆడిటర్ని కూడా కన్‌సల్టుచేసి, మరీ డిసైడ్ చేశానే. నన్నురాంభొట్లు గారి అచ్చమ్మ పెళ్ళాడతానందని మీరంటే వాళ్లందరితో నాకు పనేమిటని తిరస్కరించానే. నిత్యం మీ దివ్య సుందర విగ్రహాన్నే పూజిస్తూ వొచ్చానే.

బుచ్చ:- అంతమాట అనకండీ.

గిరీ :- అవునా, మరి అగ్రహారంలో మీరు పెట్టిన చల్ది వణ్ణం స్లైయిటెస్టు అబ్జెషన్ లేకుండా తిన్నానే. మీ తమ్ముడికి నాకొచ్చిన ఇంగ్లీషు యావత్తూ నూరి పోశానే.

బుచ్చ:- కాదని ఎవరన్నారు.

గిరీ :- సరేనా, మీరు చెప్పిన పన్లన్నీ భృత్యుడిలా చేస్తూ వొచ్చానే. మీ నాన్న అన్న మాటలన్నీ పడ్డానే, మీ అమ్మ నూతిలో పడితే నా ప్రాణాన్ని సైతం లెక్క చెయ్యక గభీమని దూకి ప్రాణం కాపాడానే మీ ఇంట్లో అరవ చాకిరీ చేశానే.

బుచ్చ:- చెయ్యలేదని ఎవరన్నారు.

గిరీ :- అవునా, మరి ఇంకా దేవుడు మేలు చేస్తే, రాత్రిళ్లు నిద్రా గిద్రా లెక్క చెయ్యకుండా అరబ్బీ నైట్సు, కాశీ మజిలీలు, మదన కామరాజు కధలూ చెబుతూ వుంటే నా పక్కన కూర్చొని మీరు ఎంతో సరదగా విన్నారే.

బుచ్చ:- అవుననుకోండీ.

గిరీ:- మరి ఆనాడు నే చెప్పిన పని చేస్తానని ప్రమాణం చేసి ఇన్నేళ్లు గడిచినా మాట చెల్లించుకోక పోతే ఇహ నాకు చావు తప్పదు. అది రాకమునుపే నన్ను స్వర్గానికి వెళ్ళనీండి. ఆపకండి. నే వెళ్ళక తప్పదు.

(పోబోతాడు)

బుచ్చ:- (గిరీశం చెయ్యి పట్టుకొని) వెళ్ళక తప్పదంటారా.

గిరీ :- ఏం చెయ్యను. నాకై నేను వెడుతున్నానా వొదినా? నాకు మాత్రం నిన్ను విడిచి పోవాలనుందా? తప్పని స్థితి.

బుచ్చ:- అయితే వెడతామంటారు.

గిరీ :- (వొంగి మోకాలు క్రిందఆనించి సంబోధిస్తూ)మీరు అలాగే అని ఒక్క మూడక్షరాల మాట శలవిస్తే చిరకాలం మీకు దాసుడిగా ఇక్కడేవుండిపోతాను. మీ కొంగట్టుకునే తిరుగుతాను. మీ నీడనే బ్రతుకుతాను. చెప్పండి వొదినా. ప్లీజ్.

బుచ్చ:- మరి..........

గిరీ :- సందేహమేమిటో చెప్పండి.

బుచ్చ:- చేస్తారా?

గిరీ :- మీ మాట యన్నడైనా కాదన్నానా?

బుచ్చ:- అయితే ఒక్క కండీషన్.

గిరీ :- ఆమాత్రం భరవాసా ఇస్తే ఎన్ని కండీషన్లు పెట్టినా, సప్త సముద్రాలు దాటమన్నా శిరసావహిస్తాను.

బుచ్చ:- మీరీ తిరుగుడు మాని ఒకచోట స్థిరంగా వుండాలి.

గిరీ :- కాదంటానా వొదినా.

బుచ్చ:- రెండవది నిత్యహాస్యం మాని, ఏదైనా వృత్తి చెయ్యాలి.

గిరీ :- వృత్తి చెయ్యడం నాకూ ఇష్టమే డియర్.

బుచ్చ:- ఆ వృత్తి నా ఉద్యోగానికి సంబంధించిందై వుండాలి.

గిరీ :- ఓ. డెవలప్‌మెంట్ కూడా రిఫార్మే కాబట్టి ఎగ్రీడ్. కాని వొదినా..........

బుచ్చ:- ఇంకా యేమిటి?

గిరీ :- నాకు ఉద్యోగం ఎవరిస్తారిక్కడ?

బుచ్చ:- వెయ్యి సిఖా రూపాయల ఉద్యోగమంటే దొరకదు. గాని బ్లాక్ డెవలప్‌మెంట్‌లో మీకు తగిన పని దొరక్కపోదు.

గిరీ :- అంతకంటెకావలసిందేమి? మహాభాగ్యం ధన్యోస్మి. ధన్యోస్మి.

బుచ్చ:- మరి ఇవ్వాళే డెవలప్‌మెంట్ కమీషనర్ గారు వొస్తున్నారు. వారిని చూస్తారా?

వెంక:- ప్రవేశిస్తూ - ఏమిటీ అప్పుడే కమీషనర్ గారిని చూచేదాకా వొచ్చింది. మా గురువుగారు రిఫార్ము అయినట్టేనా?

గిరీ :- ఓయస్, మైడియర్ బ్రదరిన్లా. మీ సిస్టర్ డెసిషన్‌తో అంతా సెటిలై పోయిందోయ్. ఇపోక్ మేకింగ్‌డెసిషన్ తీసుకుందోయ్ మీ సిస్టరూ.

బుచ్చ:- మీరుకూడా ఇపోక్‌మేకింగ్ ఎగ్రిమెంటు ఇచ్చేరుగా.

గిరీ :- ఆఁ ఆఁ అలాంటిదే, ఎంప్రెస్.

వెంక:- మరి కాఫీ వొచ్చింది, డైనింగ్ హాలుకు వెడదాం పదండి.

గిరీ :- రైటో శిష్యా, అలా పురమాయిస్తూ పోయావంటే. మన రీహాబిలిటేషన్ యామంత కష్టం కాదు.

వెంక:- ఇటురండీ.

గిరి :- అలాగే పదా. (ఇంకా వుంది)

---o---

# గిరిజనాభ్యుదయం

శ్రీ ఎన్. రామేశన్, ఐ.ఏ.ఎస్.

ఏజన్సీ ప్రాంతాల గిరిజనులు వడ్డీ వ్యాపారుల ఉక్కు హస్తాలలో నలిగి పోతున్నారు. చిర కాలంగా వారు గురి అయే బాధలలో యిది ఒకటి. దీని నుంచి వారికి విముక్తి ప్రసాదించి వారి ఆర్థిక పరిస్థితిని అభివృద్ధి చేయటానికి గడచిన మూడు సంవత్సరాలుగా ఆంధ్ర షెడ్యూల్డు జాతుల సహకార ఆర్థిక, అభివృద్ధి సంస్థ చక్కని కృషి చేస్తున్నది.

ఆంధ్ర ప్రదేశ్‌లో గిరిజనులు విస్తారంగా వున్నారు. ప్రభుత్వం సంక్షేమ కార్యకలాపాలను చేపట్టిన ప్రస్తుత సందర్భంలో యీ గిరిజనుల పునరావాస సమస్యకు పెద్ద ప్రాముఖ్యం యేర్పడింది. గిరిజనులు విస్తారంగా గల ప్రాంతాలకు ఏజన్సీ ప్రాంతాలని పేరు. ఎందువల్లనంటే యీ ప్రాంతాలను కలక్టర్లు గవర్నరు ఏజంట్లుగా పరిపాలించే వారు.

మన రాష్ట్రం ఏజన్సీ ప్రాంతాలు ముఖ్యంగా మధ్య ప్రదేశ్, ఒరిస్సా, ఆంధ్ర ప్రదేశ్‌ల మధ్యగల తూర్పు కనుమలలోవున్నాయి. ఇవి దీర్ఘంగా, సన్నగా వుంటాయి. ఆంధ్ర ప్రాంతంలో మొత్తం 6,500 చ. మై. విస్తీర్ణంగల ఏజన్సీ ప్రాంతంలో దాదాపు 50 లక్షల మంది ప్రజలు నివసిస్తున్నారు. వీరిలో వివిధ రకాల సంస్కృతీ నాగరికతలు గల తెగలు చాలా వున్నాయి. ఈ తెగలన్నీ ఒకే రకమయినవి కావు. కారణం అవి మానవ పరిణామ దశలో ప్రధాన భాగం నుండి విడివడి దుర్గమమయిన, వ్యాధిగ్రస్తమయిన ప్రాంతాలలో నివసించటం వల్ల కాలక్రమేణా ఆ ప్రజలు ఆఖరికి వారిలో వారు కూడా విభిన్నులుగా మారారు. మానవ శాస్త్రజ్ఞులు గిరిజనులను మూడు తరగతులుగా విభజించారు. 1. ప్రోటో ఆస్ట్రలాయిడ్, 2. మాంగలాయిడ్, 3, నెగ్రిటో. మన రాష్ట్ర ఏజన్సీ ప్రజలలో ప్రధానంగా ప్రోటో ఆస్ట్రిలాయిడ్ ఆకార విశేషాలు కనబడతాయి. మనుషులు అంత పొడుగు పొట్టి కాకుండా వుంటారు. బలమయిన తలలు, వంకీలు తిరిగిన లేక వూలులా వున్న జుట్టు, వెడదముకు పుటాలు కలిగి వుంటారు.

దేశంలో చాల తెగల గిరిజనులున్నారు. రాష్ట్రపతి ఏజన్సీ ప్రాంతాలలోని వివిధ తెగలను షెడ్యూల్డుజాతులుగా ప్రకటించారు. వీరి విషయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ ప్రత్యేక శ్రద్ధ వహిస్తాయి. మన రాష్ట్ర ఏజన్సీ ప్రాంతాలలో కోయ, జలుపు, సవర, జగత, వాల్మీకి వగైరా జాతులు వున్నాయి.

గిరిజనులు చాల నిరాడంబరులు. చిరకాలంగా వీరు మైదానాల వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాలలో చిక్కుకున్నారు. మిక్కిలి ముఖ్యమయిన వీరి సమస్యలు యివి:

1. ఎక్కువ సుఖ సౌలభ్యాలతో సరుకు విక్రయానికి రాకపోకల సౌకర్యాల కల్పన.
2. షావుకార్ల పిడికిలి నుంచి విముక్తికై వారి ఆర్థిక పరిస్థితి అభివృద్ధి.
3. సంచార జీవితాన్ని ఒదిలి ఒకచోట స్థిరపడి వ్యవసాయం చేసుకోడానికి వీలుగా సాంఘిక విద్యా బోధన.

ఇదివరలో పెక్కురు అధికార్లు పరిశీలనలు జరిపారు. ఈ పరిశీలనల ప్రాతిపదికపై ప్రభుత్వం పెక్కు పునరావాస పథకాలను రూపొందించింది. వీరు తమ సంచార జీవి

తానికి స్వస్తి చెప్పి ఒకచోట స్థిరపడ్డానికి వీలుగా యింతవరకు పెక్కు భూమి కాలనైజేషన్ పథకాలు-ఉదాహరణకు విశాఖ జిల్లా తాజంగిలో-ప్రారంభించబడినవి.

## వడ్డీ వ్యాపారుల సమస్య

గిరిజనుల ఆర్థిక ప్రమాణాల అభివృద్ధి విషయంలో, ఆర్థిక పునరావాస పథకాల వల్ల వారి ఆర్థిక పరిస్థితులలో చెప్పుకొన తగిన అభివృద్ధి యేమీ జరగలేదని కనుగొనబడింది. కారణం, వారి ఆర్థిక వ్యవహారాలు కేవలం కొంచరు షావుకార్లు, వడ్డీ వ్యాపారుల చేతులలో వున్నాయి. వీరు గిరిజనులకు విపరీతమయిన వడ్డీలపై అప్పులు ఇస్తారు. ఈ వడ్డీ రేటు ఒక్కొక్కప్పుడు 200 శాతం వరకు వుంటుంది. గిరిజనులు ఒక్కొక్కప్పుడు తమ భూములు, సరుకు వగైరాలను చాలా సంవత్సరాలు ముందుగా తనఖా పెట్టేవారు. దీని కారణం వల్ల ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమం వల్ల యేదైనా లాభం కలిగితే అది అసలు మనుష్యులకు చేరకుండా మధ్యలో యీ షావుకార్ల పరమయ్యేది.

ఈ సమస్య పెక్కు ప్రభుత్వాలకు ఆందోళనకరంగా వుండేది. గిరిజనుల ఆర్థిక పరిస్థితి తగినంతగా అభివృద్ధి కావాలంటే షావుకార్లను తప్పించి సరసమైన వడ్డీపై వారికి అప్పుదొరికే యేర్పాట్లు చేయాలని గుర్తించబడింది.



అమ్మకానికి తెచ్చిన అడ్డాకులను స్వయంగా తూస్తున్న గిరిజనుడు

## కార్పొరేషను

ఈ ఆశయాలను దృష్టిలో పెట్టుకుని, ఏజన్సీ ప్రాంతాలలో ప్రత్యేక ఏజన్సీ అభివృద్ధి అధికారిగా తీవ్ర పరిశీలన జరిపిన శ్రీ ఆర్.ఎస్. మలయప్పన్, ఐ.ఏ.ఎస్., ఏజన్సీలో బహుళార్థసాధక సహకార సంఘాల స్థాపనకు ప్రతిపాదనలు చేశారు. అయితే, వాటా మూలధనం, నిర్వహణ సిబ్బంది కయ్యే ఖర్చుల ప్రశ్న యెదురయింది. ఇందు నిమిత్తం డబ్బు యివ్వగల స్తోమత గిరిజనులకు లేదు. వీటిని ప్రభుత్వం సబ్సిడీగా యిస్తే, స్వయం సహాయ, పరస్పరసహాయ సూత్రాలపై యేర్పడే సహకార సంఘంగా యీ సంఘాన్ని పరిగణించటానికి వీలుండక, అది ప్రభుత్వ సహాయ సూత్రంపై యేర్పడిన ప్రభుత్వ సంఘంగా తయారవుతుంది. కనుక యీ సమస్యను దీర్ఘంగా ఆలోచించినమీదట, ఆర్థిక అభివృద్ధి కార్పొరేషన్ స్థాపన యీ ఆశయ సిద్ధికి వుత్తమ మార్గమని నిర్ణయించబడింది. ఈ పథకాన్ని అప్పటి

న్యాయ, ఆర్థిక శాఖ మంత్రి శ్రీ తెన్నేటి విశ్వనాథం తయారు చేశారు. ఈ సంస్థ మొదట 1913 భారతీయ కంపెనీల చట్టం క్రింద ఆరంభమయి, కంపెనీగా 16—4—56 న రిజిష్టరయింది. అయితే, యీ సంస్థ పెట్టుబడికి నిశ్చితమయిన వనరులు లేనందున కంపెనీగా దాని భవిష్యత్తు సుస్థిరంగా వుండదని యీ పథకం పట్ల అత్యంత ఆసక్తి గైకొన్న వెనుకటి గవర్నరు శ్రీ సి.ఎమ్. త్రివేదీ అభిప్రాయ పడ్డారు. తుదకు, మరికొంత చర్చ అనంతరం, ముఖ్యంగా రిజర్వు బ్యాంక్ క్రింద జాతీయ వ్యవసాయ పరపతినిధి, ఇండియా స్టేట్ బ్యాంకి క్రింద ఏకీకరణ, అభివృద్ధి నిధి వగైరా పెక్కు జాతీయ నిధులు వున్నందునను, దేశంలో ఏకీకృత గ్రామీణ పరపతి పథకాల ప్రయోజనం పూర్తి వినియోగానికి వీలుగాను కంపెనీగా యీ సంస్థను యెత్తివేసి అదే ఆశయాలతో సహకార సంఘంగా యేర్పరచాలని నిర్ణయించబడింది. ఈ సంస్థ సహకార సంఘంగా 1956 అక్టోబరులో రిజిష్టరు చేయబడింది.

కేంద్ర సహకార సంఘమయిన యీ సంస్థ ముఖ్య కార్యాలయం విశాఖపట్నంలోవుంది. దాని వాటా మూలధనం రూ. 2,00,500. వాటాలన్నీ డైరెక్టర్ల బోర్డు పేరున ప్రభుత్వ పరంగా వున్నాయి. ఈ బోర్డులో ముగ్గురు అనధికార సభ్యులు తప్ప మిగిలిన వారంతా ప్రభుత్వాధికారులు. అయిదు ప్రాథమిక సంఘాలు వున్నాయి. వాటిలో 3 విశాఖపట్నం జిల్లాలో కె. డి. పేట, మాడుగుల, దేవరాపల్లిలో వున్నాయి. మిగిలిన రెండు శ్రీకాకుళం జిల్లాలో సీతంపేట, జి. ఎల్. పురాలలో వున్నాయి. ఈ ప్రాథమిక సంఘాలలో ఒక్కొక్క దానికి కార్పొరేషనులో రూ 100 వాటా వుంది. ఇటు కార్పొరేషనుకి యీ ప్రాథమిక సంఘాలలో దాదాపు రూ. 10,000 వాటా వున్నది.

ఈ కార్పొరేషను స్వయం నిర్ణయాధికారం గల సంస్థ. దీని నిర్వహణ కార్యకలాపాలను డైరెక్టర్లబోర్డు చూస్తుంది. సాంఘిక సంక్షేమ డైరెక్టరు దీని అధ్యక్షుడు: ప్రభుత్వ ఏజంట్లు అనగా విశాఖ పట్టణం శ్రీకాకుళం జిల్లాల కలక్టర్లు, సహకార సంఘాల అదనపు రిజిస్ట్రారు, అడవుల ప్రధాన రక్షకుడు, వ్యవసాయ డిప్యూటీ డైరెక్టరు, రాష్ట్ర మార్కెటింగు ఆఫీసరు దీని సభ్యులు. ముగ్గురు అనధికార



వారం వారం జరిగే సంతలలో కార్పొరేషన్ గిరిజన బాలలకు డబ్బా పాలను పంచిపెడుతుంది.
చింతపల్లి సంతలో ఒక దృశ్యం



చింతపల్లి సంత—గిరిజనులు సరుకు అమ్ముకుని డబ్బు తీసుకుంటున్నారు.

సభ్యుల వివరాలు యివి: పా. స. శ్రీ కె. వీరన్న పడలీ శా. స. స. శ్రీమతి పి. వాణీ రమణారావు, శ్రీ పి. ఎల్. ఎన్. రాజు. ఈ సంస్థ కార్యకలాపాలన్నీ పూర్తిగా డైరెక్టర్ల బోర్డు చేతిలో వుంటాయి. అది తన సమావేశాలలో అక్కడికక్కడ తీసుకోవలసిన నిర్ణయాలను తీసుకుంటుంది.

ఈ సంస్థ దైనందిన వ్యవహారాలను సంస్థ జనరల్ మానేజరు అనే పేరుతో ఒక డిప్యూటీ కలక్టరు నిర్వహిస్తారు. ఈయనకు వ్యవసాయ శాఖ యిచ్చిన మార్కెటింగు ఆఫీసరు తోడ్పడుతారు. ఈ సంస్థ ముఖ్య పనులు యివి:—

1. గిరిజనులకు సరయిన ధర యిచ్చి అడవి వస్తువులను కొని సంస్థకు మిక్కిలి లాభకరమయిన పద్ధతిలో వాటి విక్రయం.
2. బియ్యం, కిరసనాయిలు, పప్పు దినుసుల వంటి గృహావసరాలను గిరిజనులకు అందచేయడం.

ఈ రెండు ఆశయాల సాధనకై యీ సంస్థ ఏజన్సీలోని సంత ప్రదేశాలలో పెక్కు గిడ్డంగులను నిర్మించింది. ప్రతి సంత రోజున డిప్యూటీ తహశీల్దారు హోదా గల యీ సంస్థ అధికారి సంతకు వెళ్లి గిరిజనులు తెచ్చిన సరుకును కొని వారికి అక్కడికక్కడ రొఖ్ఖం చెల్లిస్తారు. సంస్థ మార్కెటింగు ఆఫీసరు ధరల మొగ్గును గురించి డిప్యూటీ తహశీల్దార్లకు తెలియపరుస్తారు. ఇందువల్ల గిరిజనులకు యిదివరకు షావుకార్లు కాంట్రాక్టు పద్ధతి కొనేటప్పుడు వలె తక్కువ ధర, పోటీ ధర కాక సరయిన ధర కిడుతుంది.

ఇంతవరకు అటవీశాఖ ఏజన్సీ సరుకును కొనే హక్కును బహిరంగ వేలంలో కంట్రాక్టర్లకు కౌలుకిస్తూ వుండేది. ఇప్పుడీ పద్ధతికి స్వస్తి చెప్పబడింది. కార్పొరేషను ప్రభుత్వ వుత్తరువులలో, అడవి వస్తువుల సేకరణను గుత్తకు తీసుకున్నది. ఇది అటవీ శాఖకు రుసుం చెల్లించి గిరిజనుల వద్ద సరుకు కొంటుంది. వారికి చాల సరసమయిన ధర చెల్లిస్తుంది. డిప్యూటీ తహశీల్దారు తనతో కూడా బియ్యం. పప్పు. కిరసనాయిలు. పప్పు దినుసులు వగైరా గృహావసరాలను తీసుకు వెళ్లి గిరిజనులకు రొఖ్ఖానికి అమ్ముతారు. ఈ విధంగా గిరిజనులు సంతలో లాభసాటిగా సరుకు అమ్ముకుని బియ్యం వగైరా సరుకుల్ని లాభసాటిగానే కొనుక్కుని యిళ్లకు వెడతారు. వారికి

ఖర్చులు పోను కొంత డబ్బు మిగులుతుంది.

ఈ పద్ధతిలో చాల లాభాలున్నాయి. ఒకటి, కార్పొరేషను గిరిజన గ్రామాలకు వెళ్లి అక్కడ సంతలలో వ్యాపారం చేస్తుంది కాబట్టి కేంద్రీకృత శాఖ వల్ల కలిగే యిబ్బందులు తొలగిపోయినవి. రెండు, కంట్రాక్టర్లు, పోటీ పద్ధతి తప్పించబడినందున గిరిజనులకు కార్పొరేషను చేతులలో న్యాయం జరుగుతున్నది. మూడు, కార్పొరేషను అధికార్లకు వ్యవసాయ శాఖ మార్కెటింగు నిపుణుల తోడ్పాటు వున్నందున ధరలలో యేమైనా హెచ్చుదల వుంటే గిరిజనులకు బడుతుంది.

సంతలలో కొన్న ఏజన్సీ సరుకు నిర్ణీతమయిన గిడ్డంగులకు పంపబడి అక్కడ జాగ్రత చేయబడుతుంది. సరుకు పూర్తిగా భీమా చేయబడుతుంది కూడా. తరువాత అది తదిలో ఉత్తమ ధరలకు అమ్మబడుతుంది.

ఇప్పుడు అందుబాటులోనున్న ముఖ్యమయిన ఏజన్సీ వస్తువులు యివి: అడ్డాకులు షీకాయ, కొండ తేనె, కొండ చీపుళ్లు వగైరా. వాటిలో అడ్డాకులు. షీకాయ చిన్న చిన్న అడవి వస్తువులలో అగ్రస్థానం వహిస్తాయి. అడ్డాకుల విస్తళ్లను కార్పొరేషను తిరుచనాపల్లి, మధుర, కోయంబత్తూరుల వంటి దూర ప్రదేశాలలో కూడా అమ్ముతుంది.

కొండ చీపుళ్లకు బాగా జనాదరణ వుంది. దాదాపు బొంబాయి నగరానికి కావలసిన చీపుళ్ళన్నిటినీ కార్పొరేషనే సరఫరా చేస్తుంది. తాము రోజూ వుపయోగించే చీపుళ్లు ఆంధ్ర ఏజన్సీ నుంచి వస్తాయని బహూశా బొంబాయి గృహిణులకు తెలియదు.

కార్పొరేషనుకి మంచి లాభాలే వస్తున్నాయి. 1956-57 లో అది ఆలస్యంగా పని ప్రారంభించి నందున ఆ సంవత్సరంలో రూ 2,473 మాత్రమే నికరం లాభం వచ్చింది. 1958—59 లో అది రూ 34,226 కి పెరిగి పోయింది. 1958-59 లో అది రూ. 92,918 గా వుంది.

ప్రస్తుతం, యీ సంస్థ తన కాళ్లమీద తాను నిలబడగలిగే వరకు, సిబ్బంది వ్యయం భరించడానికి ప్రభుత్వం అంగీకరించింది. అయినప్పటికీ. గడచిన రెండు మూడు సంవత్సరాలలోను యీ సంస్థ కార్యకలాపాలు ప్రోత్సాహకరంగా వున్నాయి. ఆంధ్రలో యితర జిల్లాల యేజన్సీలకు, తెలంగాణాలోని ఏజన్సీకు కూడా యీ సంస్థ కార్య కలాపాలను విస్తరించే పథకాలు తయారవుతున్నాయి.

మొత్తం భారత దేశంలో యిటువంగి సంస్థ యిదొక్కటే. విజయవంతమయిన కృషిలో యిది భారత దేశానికి మార్గ దర్శకం కాగలదని ఆశించ బడుతున్నది.



కార్పొరేషను దుకాణంలో గిరిజనులు ఉప్పు వగైరా సరుకుల్ని కొనుక్కుంటున్న దృశ్యం.

# రాష్ట్రంలో ప్రజాస్వామ్య వికేంద్రీకరణ

ప్రధాన మంత్రి పండిత్ నెహ్రూ 11-10-59న హైదరాబాదు జిల్లా షాద్‌నగరంలో పంచాయతీ సమితిని ప్రారంభించటంతో యీ రాష్ట్రంలో 'ప్రజలకు నిజమైనస్వరాజ్యం అందుబాటు అయే' నూతనాధ్యాయంఆరంభమయింది. ప్రజలకు పూర్తిబాధ్యత యిచ్చినప్పుడు స్వీయాభివృద్ధికై వారెంత సమర్థంగా పనిచేస్తారో గడచిన యేడాది నెలకొల్పబడిన యిరవయి ఆడ్‌హాక్ పంచాయతీ సమితుల పనివల్ల తెలిసింది. ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల చట్టం ఆమోదం పిమ్మట, యిప్పుడు సమితులు, పరిషత్తులు చట్టరీత్యా యేర్పరచబడుతున్నవి. ప్రజాస్వామ్య వికేంద్రీకరణ విషయంలో జరిగే యీ కొత్త ప్రయోగంలో, రాజస్థాన్‌తో కలిసి, ఆంధ్రప్రదేశ్ మార్గదర్శి అవుతున్నది.

ఈ చట్టం ప్రకారం ప్రజా సంస్థలలో మూడు శ్రేణులు వుంటాయి. గ్రామ స్థాయిలో 1,000 అంతకు మించిన జనాభా గల గ్రామాలకు పంచాయతీలు యిదివరకే యేర్పరచబడినవి. అంతకు తక్కువ జనాభాగల గ్రామాలు వీలుననుసరించి కలుపబడినవి. ఈ పంచాయతీలన్నీ ఆంధ్ర ప్రాంతంలో ఒక్క ఏజన్సీ ప్రాంతాలలో తప్ప, సరాసరి ఎన్నికల పద్ధతిలో యేర్పాటు చేయబడినవే. భూమి శిస్తులో ప్రతి రూపాయకు 50 న. పై. చొప్పున హెచ్చు స్థానిక సెస్సు వసూలు, సెస్సులో నుంచి 12 న. పై. వాటికి యివ్వటం మున్నగు చర్యల ద్వారా పంచాయతీల ఆదాయాన్ని హెచ్చించాలని సంకల్పించబడింది. పంచాయతీ సమితుల యొక్క, ప్రభుత్వం యొక్క స్థానిక అభివృద్ధి కార్యక్రమాల అమలును సాధ్యమైనంత వరకు పంచాయతీల ద్వారా జరిపించాలని కూడా ప్రభుత్వం నిర్ణయించింది.

బ్లాకు స్థాయిలో రాష్ట్రంలోని 227 బ్లాకులకు పంచాయతీ సమితులు వుంటాయి. వీటిలో పూర్వ విస్తరణ కేంద్రాలు ఏజన్సీ ప్రాంతాలలో కేంద్రాలు చేరి లేవు. పూర్వ విస్తరణ కేంద్రం మొదటి అంచె కేంద్రంగా మారినప్పుడు దానికి కూడా పంచాయతీ సమితి యేర్పరచబడుతుంది. బ్లాకులోని పంచాయతీల అధ్యక్షులందరు సమితి సభ్యులుగా వుంటారు. శాసనసభ సభ్యులు తమ తమ నియోజక వర్గాలలోగల సమితి లేక దాని స్థాయి సంఘాల సమావేశాలలో పాల్గొనవచ్చు. అయితే వారికి ఓటు హక్కు వుండదు. అలాగే రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లు కూడా తమ తమ అధ్వర్యం క్రింద గల ప్రాంతాల సమితి లేక దాని స్థాయి సంఘాల కార్యక్రమాలలో పాల్గొనవచ్చు. పంచాయతీ సమితి సభ్యులు ఒక మహిళను, షెడ్యూల్డు కులాల ప్రతినిధిని ఒకరిని, బ్లాకు మొత్తం జనాభాలో గిరిజనుల జనాభా నిర్ణీత శాతాన్ని మించినప్పుడు షెడ్యూల్డుజాతుల ప్రతినిధిని ఒకరిని తదితర సందర్భాలలో షెడ్యూల్డు కులాల నుంచి మరొక ప్రతినిధిని. పరిపాలన, ప్రజా జీవితం, గ్రామాభివృద్ధి లేక సాంఘిక సేవలో అనుభవం వున్న యిద్దరు వ్యక్తులను—ఇందులో ఒకరు మహిళ, మరొకరు బ్లాకులో పనిచేస్తున్న సహకార సంఘం సభ్యుడు అయి వుండాలి—కో అప్టు చేసు కుంటారు. ఇలా యేర్పడిన పంచాయతీ సమితి సభ్యులందరూ తమనుంచి అధ్యక్ష ఉపాధ్యక్షుల్ని యెన్నుకుంటారు.

పంచాయతీ సమితి సమాజాభివృద్ధి కార్యక్రమం అమలుతో సహా బ్లాకు వ్యవహారాలను పూర్తిగా చూస్తుంది. ఆ పైన. బ్లాకు ప్రాంతంలో వ్యవసాయం, పశుపోషణ, పరి

శ్రమలు, విద్య, స్త్రీ సంక్షేమం, సహకారం, సాంఘిక సంక్షేమం వంటి ప్రభుత్వ శాఖల పనులను కూడా పంచాయతీ సమితులకు అప్పగించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ప్రాథమిక విద్య, ప్రజారోగ్యం, వైద్యసహాయం మున్నగు విషయాలలో జిల్లా బోర్డుల పని కూడా చాల భాగం సమితులకు బదిలీ చేయబడుతుంది. ఆఖరికి, బ్లాకు స్థాయిలో సమస్త అభివృద్ధి కార్యక్రమాలు పంచాయతీ సమితి అధ్వర్యంలో జరగాలని ప్రభుత్వాశయం.

## స్థాయీ సంఘాలు

ఈ పనుల నిర్వహణకు సమితికి 5 స్థాయి సంఘాలు వుంటాయి. ఒకటి వ్యవసాయం, పశుపోషణ, చిన్న నీటి పారుదల వగైరాలను, మరొకటి సహకారం, కుటీర పరిశ్రమలు వగైరాలను, మూడవది విద్య, సాంఘిక విద్య, ఆరోగ్య పారిశుద్ధ్యాలు, వైద్య సహాయం, సాంఘిక సంక్షేమం వగైరాలను, నాలుగవది రాకపోకల సౌకర్యాలు, అయిదవది పన్ను విధింపు, ఆర్థిక వ్యవహారాలను చూస్తాయి. అవసరమనుకుంటే ప్రభుత్వం స్త్రీ శిశు సంక్షేమానికి ఒక ప్రత్యేక సంఘాన్ని యేర్పరచవచ్చు. పంచాయతీ సమితులు అవసరమనుకుంటే ప్రభుత్వం ఆమోదంతో మరికొన్ని స్థాయి సంఘాలను యేర్పాటు చేసుకోవచ్చు. పంచాయతీ సమితి, సహకారం, కుటీర పరిశ్రమలలో అనుభవం కలిగిన సభ్యులు కాని వ్యక్తులు యిద్దరిని సహకార స్థాయి సంఘం వగైరాలలో సభ్యులుగా తీసుకోవాలి. ఈ స్థాయి సంఘాలకు నిర్ణీతమయిన హద్దులలో స్వతంత్రమయిన మంజూరు అధికారాలుంటాయి. ఆ హద్దులలో అవి పథకాలు వగైరాలను అమలుపరచవచ్చు.

బ్లాకు అభివృద్ధి అధికారి పంచాయతీ సమితి ప్రధాన కార్య నిర్వాహకాధికారిగా వుంటారు. విస్తరణ సిబ్బంది పంచాయతీ సమితి క్రింద పనిచేస్తుంది. పంచాయతీ సమితి, దాని స్థాయి సంఘాల తీర్మానాల అమలు ప్రయోజనానికై పంచాయితీ సమితి అధ్యక్షుడు బ్లా.అ.అ.కి పై అధికారి కాగలడు.

పంచాయతీ సమితి నిధులలో దిగువవి వుంటాయి:-

1. సాధారణ ప్రయోజనాలకై భూమిశిస్తునుంచి బ్లాకు జనాభాలో తలకి 25 న.పై.కి సమానమయినసొమ్ము
2. రాకపోకల సౌకర్యాలకు కేటాయించబడి బ్లాకు జనాభాలో తలకి 30 న.పై.కి సమానమయిన సొమ్ము.
3. స్థానిక సెస్సును 50 న.పై.కి హెచ్చించటానికి శాసనసభ అంగీకరిస్తే, సాధారణ ప్రయోజనాలకై బ్లాకులో వసూలు చేయబడే భూమిశిస్తు సంకల్పించిన రూపాయకు 50 న.పై. స్థానిక సెస్సులో నుంచి వచ్చే 8 న.పై.
4. ప్రాథమిక విద్యకై (సంకల్పించిన) 50 న.పై. భూమి సెస్సులో 25 న.పై.
5. ఆస్తి బదిలీపై విధింపబడే సుంకం రాబడిలో అయిదవ వంతు.
6. సమాజాభివృద్ధికి యేర్పడిన సొమ్ము.
7. అఖిలభారత సంఘాలు వగైరాలనుంచి వచ్చేసొమ్ము.
8. పంచాయితీలనుంచి వసూలు చేయబడే విరాళాలు.
9. ప్రజల విరాళం.

పంచాయతీ సమితులకు తగిన ఆర్థిక వనరులు వుండగలవని భావించబడుతున్నది.

## పరిషత్తులు

జిల్లా స్థాయిలో దిగువ సభ్యులతో జిల్లాకొక జిల్లా పరిషత్తు వుంటుంది:—

1. జిల్లాలోని ప్రతి పంచాయతీ సమితి అధ్యక్షుడు.
2. జిల్లా కలక్టరు.
3. జిల్లా నుంచి రాష్ట్ర శాసనసభకు ఎన్నికయిన సభ్యులు.
4. ప్రభుత్వం వుత్తర్వు ద్వారా నిర్దేశించగల శాసన మండలి సభ్యులు.
5. జిల్లాలో భాగమయిన నియోజకవర్గం నుంచి లోకసభకు ఎన్నికయిన సభ్యులు.
6. ప్రభుత్వం వుత్తర్వు ద్వారా నిర్దేశించగల రాజ్యసభ సభ్యులు.
7. పంచాయతీ సమితి యేర్పడని ప్రతి బ్లాకుకి, ఆ బ్లాకులో నివసిస్తూ ఆంధ్ర ప్రాంతంలో పంచాయతీల అధ్యక్షుల చేతను, తెలంగాణలో పట్టణ కమిటీల సర్పంచీలు, అధ్యక్షుల చేతను ఎన్నికయిన వ్యక్తి.

ఈ సభ్యులంతా ఒక మహిళను, షెడ్యూల్డు కులాల ప్రతి

నిధి నొకరిని, జనసంఖ్యను బట్టి షెడ్యూల్డు జాతుల ప్రతి నిధి నొకరిని వీరి జనసంఖ్య నిర్ణీత శాతం కంటె తక్కువ వున్నప్పుడు షెడ్యూల్డు కులాల ప్రతినిధినే మరొకరిని యెన్నుకుంటారు. రెండు మూడు జిల్లాలకి చెందిన ప్రదేశంతోకూడిన నియోజకవర్గం నుంచి లోకసభకు ఎన్నికయిన సభ్యుడు తాను నివసించే జిల్లాలోని జిల్లా పరిషత్తులో మాత్రమే సభ్యుడు కాగలడు.

సభ్యులు అధ్యక్ష ఉపాధ్యక్షులను అనధికార సభ్యుల నుంచి ఎన్నుకుంటారు. ఒక వ్యక్తి ఒకేఒక జిల్లా పరిషత్తుకే అధ్యక్షుడుగా వుండగలరు. పంచాయతీ సమితి అధ్యక్షుడు జిల్లా పరిషత్తు అధ్యక్షుడుగా ఎన్నికయితే పంచాయతీ సమితి అధ్యక్ష పదవి పోతుంది. ప్రభుత్వం జిల్లా పరిషత్తు కొక కార్యదర్శిని నియమిస్తుంది. ఈయన సాధారణంగా జిల్లా పరిషత్తు లేక దాని స్థాయి సంఘాల సమావేశాలకు హాజరయి వాటి చర్చలలో పాల్గొన వచ్చు, కాని ఓటు హక్కు మాత్రం వుండదు.

ప్రతి జిల్లా పరిషత్తుకు దిగువ ప్రయోజనాలకై స్థాయి సంఘాలు వుంటాయి.

1. ప్రణాళికలు, సమాజాభివృద్ధి, రాకపోకల సౌకర్యాలు.
2. ఆహారం, వ్యవసాయం, సహకారం, పశుపోషణ, అడవులు, నీటి పారుదల, విద్యుచ్ఛక్తి.
3. కుటీర, గ్రామ, చిన్నరకం పరిశ్రమలు.
4. విద్య, వైద్య ప్రజారోగ్య సేవలు, సాంఘిక సంక్షేమం.
5. పన్ను విధింపు, ఆర్థిక వ్యవహారాలు.

జిల్లా పరిషత్తు అవసరమనుకొంటే పై విషయాలు కాక మరెందుకయినా ప్రభుత్వం ఆమోదంతో మరొక స్థాయి సంఘాన్ని యేర్పాటు చేసుకోవచ్చు. విద్య, సాంఘిక సంక్షేమం వగైరా స్థాయి సంఘంలో మాత్రం 10 మంది సభ్యులుంటారు. మిగిలిన అన్ని సంఘాలలోను 9మంది వుంటారు. ఆహారం, వ్యవసాయం, సహకారం, పశుపోషణ, అడవులు, నీటి పారుదల, విద్యుచ్ఛక్తి, పరిశ్రమలు, కుటీర గ్రామ పరిశ్రమలకు సంబంధించిన స్థాయి సంఘాలకు, సందర్భాన్ని బట్టి సహకారం లేక కుటీరపరిశ్రమలలో అనుభవం, పరిజ్ఞానం కలిగి జిల్లా పరిషత్తు సభ్యులు కాని యిద్దరు వ్యక్తులు యెన్నుకొనబడవచ్చు. పరిషత్తు అధ్యక్షుడు, జిల్లా కలక్టరు స్థాయి సంఘాలన్నిటికి ఎక్స్ అఫీషియో సభ్యులుగా వుంటారు. మిగిలిన సభ్యులను పరిషత్తు సభ్యులు తమ నుంచి యెన్నుకుంటారు. స్థాయి సంఘాలన్నిటికి కలక్టరు అధ్యక్షుడు.

అభివృద్ధి కార్యక్రమాలు నడిపే జిల్లా అధికారులు జిల్లా పరిషత్తు లేక దాని స్థాయిసంఘాల సమావేశాలలో మాట్లాడవచ్చు. లేదా మరొక విధంగా పాల్గొన వచ్చు. వారికి ఓటు హక్కు మాత్రం వుండదు.

జిల్లా స్థాయిలో, పరిషత్తు జిల్లాలోని బ్లాకు లన్నిటి విషయంలో తయారయిన ప్రణాళికలను ఏకం చేసి, సమితుల కార్యకలాపాలను సమన్వయం చేస్తుంది. జిల్లాలో పంచాయతీ సమితుల బడ్జెట్టులను పరిశీలించి ఆమోదిస్తుంది. పంచాయతీ సమితులు లేని బ్లాకులలో యీ పరిషత్తు పంచాయతీ సమితిగా వ్యవహరిస్తుంది. సెకండరీ, వృత్తి విద్యా, పారిశ్రామిక పాఠశాలలను నెలకొల్పుతుంది, నిర్వహిస్తుంది లేదా విస్తరిస్తుంది. అభివృద్ధి కార్యకలాపాలు వగైరాకి సంబంధించిన అన్ని విషయాలలోను అది ప్రభుత్వానికి సలహా యిస్తుంది కూడా.

జిల్లా పరిషత్తు ఆర్థిక వనరుల వివరాలు యివి:—

1. జిల్లా పరిషత్తుకు కేటాయించబడిన కేంద్ర లేక రాష్ట్ర ప్రభుత్వం నిధులు.
2. కుటీర, గ్రామ, చిన్న పరిశ్రమలాది అభివృద్ధికి అఖిల భారత సంస్థల నుంచి వచ్చే గ్రాంటులు.
3. నిర్ణయించబడగల మేరకు భూమి సెస్సు, పన్ను లేక రుసుంలో వాటా.
4. ఏ చట్టం క్రిందనైనా జిల్లా పరిషత్తు విధించగల పన్నులు లేక రుసుం వల్ల వసూలయే సొమ్ము.
5. పరిషత్తు నిర్వహించే ధర్మ సంస్థల నుంచి వచ్చే ఆదాయం.
6. ప్రభుత్వ వుత్తర్వు ద్వారా జిల్లా బోర్డు ఆదాయం నుంచి కేటాయింపబడగల సొమ్ము.
7. ఏ రూపంలోనైనా పంచాయతీ సమితులు లేక ప్రజల నుంచి వసూలు చేసే విరాళాలు,
8. ప్రభుత్వం ముందు ఆమోదంతో పరిషత్తు పంచాయతీ సమితుల నుంచి వసూలు చేసే విరాళాలు.

జిల్లా బోర్డులు:— జిల్లా పరిషత్తుల యేర్పాటు పిమ్మట ప్రభుత్వం జిల్లా బోర్డులను రద్దుచేసి వాటి పనులను, ఆస్తి అప్పులను పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు బదిలీ చేస్తుంది. స్థూలంగా, ప్రాథమిక విద్య, రాకపోకల సౌకర్యాలు, వైద్య ప్రజారోగ్యాలు పంచాయతీ సమితులకు సెకండరీ విద్యకు సంబంధించిన పనులు జిల్లా పరిషత్తులకు బదిలీ చేయబడతాయి. పంచాయతీ సమితులులేని బ్లాకులలో జిల్లా బోర్డుల పనులన్నిటిని పరిషత్తులే చేస్తాయి అట్టి బ్లాకులకు పంచాయతీ సమితులు యేర్పడిన నాడు అవి చేయ వలసిన పనులు వాటికి అప్పగించబడతాయి.

## నాయకత్వం

పూర్వం యెన్నడూ వివిధ స్థాయిలలోని ప్రజా సంస్థలు ప్రభుత్వంలో భాగంగా పరిగణింప బడలేదు. ఆఖరికి ప్రభుత్వ కార్యకలాపాలకి ఏజంట్లుగా కూడా అవి వుప యోగించబడలేదు. ప్రభుత్వ సంస్థలు, ప్రజా సంస్థలతో సమానాంతరంగా, తరుచు వాటి పోటీ సంస్థలుగా నడిచేవి, ఇప్పుడు యివి ప్రభుత్వంలో ఒక భాగం.

సంస్థాగతమయిన ప్రాతినిధ్యం లభించినంత మాత్రాన ప్రజలు పాల్గొంటారనే హామీ లేదు. మన సంఘంలో శక్తి వంతము, సుస్థిరము, అయిన నిజమయిన ప్రజాస్వామ్యం నెలకొనటానికి దాని వేళ్లు గ్రామ సమాజంలో పారాలి. ఈ ప్రాతినిధ్య సంస్థలకు కూమ సరిగా యిదే సూత్రం వర్తిస్తుంది. ఒక మానవ సంస్థ జయాపజయాలు దాని నాయకత్వంపై ఆధారపడి వుంటాయి. కాబట్టి యీ సమస్యలో క్లిష్టాంశం గ్రామస్థాయిలో నాయకత్వం.

ప్రజా స్వామ్య నాయకత్వం ప్రజల నుంచి రావాలి. అది ఒక సంస్థలో పుట్టి కేవలం అక్కడగల అధికారం వల్ల లేక అధికారం కోసం మనలేదు క్రమంగా సోషలిస్టు కాదలచిన యే సంఘంలో నైనా నాయకత్వం చిరకాలం వర్గ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించలేదు. నూతన నాయకత్వం ఫంక్షనల్ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించి, సోషలిస్టు సంఘంలో ప్రజలందరి పాత్రలు పరస్పర పరిపూరక మయినవే కాని పరస్పర విరుద్ధ మయినవి కావనే సత్యాన్ని చాట వలసి వుంటుంది. అట్టి నాయకత్వం లేని చోట దానిని ప్రోది చేయాలి. కాబట్టి అన్ని స్థాయిల లోను శిక్షణ అత్యవసరం. ఇది కష్టమయిన పనే. కాని దానిని తప్పించుకునే మార్గం లేదు. కారణం, ప్రజా స్వామ్య సంస్థలు మాందేట్లతో యెన్నడూ సరిగా పని చేయవు, అందుకు సాంఘిక చైతన్యం, ప్రజాస్వామ్య దృక్పథం అవసరం. దీనిని నెమ్మది మీద సాధించాలి.

ఈ సంస్థల వల్లనేమి, అవసరమయిన విద్య, శిక్షణ, నాయకత్వాల యేర్పాటువల్లనేమి సమాజాభివృద్ధి కార్యక్రమం అసలు ప్రయోజనం అనగా సమాజం స్వయంగా తన ఉన్నతిని కోరి దానిని సాధించుకునే చైతన్యం కలిగించటం నెరవేరగలదని ఆశించ బడుతున్నది.

---

చ॥ ఉరుగుణవంతుఁ డొడ్లు తన
కొండపకారము చేయునప్పు డుం
బరహితమే యొనర్చు; నొక
పట్టుననైనను గీడుఁజేయఁగా
నెఱుగడుఁ నిక్కమేకదః య
దెట్లనఁ గవ్వము బట్టి యెంతయుం
దఱువఁగ జొచ్చినం బెరుగు
తాలిమి నీయదె వెన్నః భాస్కరా.

# నాయకమణి ప్రకాశం

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం తృతీయ వార్షికోత్సవం ఆనందంతో జరుపుకొని నాలుగవ సంవత్సరంలో ప్రవేశించింది. ఈ శుభ సమయంలో మన ప్రియతమ నాయకుడు ప్రకాశం గారు ఆంధ్రుల హృదయాకాశంలో ధృవతారగా మెరుస్తూ, అనుక్షణం స్మృతిపథంలోకి తొంగిచూస్తుంటాడు.

పుట్టింది మామూలు కుటుంబంలోనే అయినా ఆయన జీవితంలో తారస్థాయి నందుకున్న మహానాయకుడు. చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయి రాజమండ్రిలో ఒక బడి పంతులు ఇంట్లో పెరిగాడు. శ్రీ హనుమంతరావు నాయుడు గారు ఆ వూళ్లో ఉపాధ్యాయుడు. ఆయన ప్రకాశం గుణగణాలకు మెచ్చి దగ్గిరకు తీసి ప్రేమతో పెంచి పెద్దవాణ్ణి చేశాడు. ప్రకాశంగారి తండ్రి ఒక గ్రామానికి మునసబుగా వుంటూండే వాడు. తండ్రి మరణానంతరం, శ్రీ హనుమంతరావు నాయుడుగారి చేతుల్లో పెరిగి ప్రకాశంగారు ప్లీడరీ వృత్తికి యోగ్యత సాధించాడు. రాజమండ్రి పురపాలక సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. అప్పటికి ఆ పురపాలక సంఘానికి అధ్యక్షులైన వారందరిలోకీ శ్రీ ప్రకాశం పిన్న వయస్కుడు. తరువాత కొంత కాలానికి కష్టపడి డబ్బు సమకూర్చుకుని ఇంగ్లండు వెళ్లి బ్యారిష్టర్ పరీక్షలో ఉత్తీర్ణుడై తిరిగి వచ్చి మద్రాసులో ప్రాక్టీసు పెట్టాడు.

మద్రాసు లాయర్లలో మైలాపూర్ లాయర్లపని ఆరోజుల్లో మహా జోరుగా వుండేది. వారిలో కొందరు అప్పటికే బాగా సంపాయించి పేరు ప్రతిష్ఠలు గడించుకున్నారు. ప్రకాశం పాత్ర రంగస్థలం మీద ప్రవేశించగానే కథ రసకందాయపు పట్టులో పడింది. అంతకు ముందున్న పరిస్థితి తారుమారయింది. అనతికాలంలోనే ఆంధ్ర దేశం నుండి వచ్చే కేసుల్లో చాలా భాగం ప్రకాశం గారి హస్తగతమైనవి. ప్రస్తుతం మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నారు గారి తండ్రి శ్రీ వెంకటరత్నం నాయుడు గారు ఒకప్పుడు ప్రకాశం గారి వద్ద జూనియర్‌గా వుండే వాడు. దీన్నిబట్టి ప్రకాశం గారు ఏకాలపు వాడో, ఎంత సీనియరో సులభంగా వూహించుకోవచ్చు. కొలది కాలంలోనే ఆయన ఆంధ్ర న్యాయవాదుల్లో ఘటికుడైన వాడనే కీర్తి మార్మోగింది.

## ఉద్యమాగ్నిలోకి ఉరికిన వీరుడు

1920తో మొదలైన దశాబ్ద ప్రారంభంలోనే గాంధీ మహాత్ముని సహాయ నిరాకరణోద్యమం దేశమంతటా వ్యాపించింది. బ్రిటిష్ పాలకాటవిలో రేగిన పెను చిచ్చులా ఉద్యమం విజృంభించింది. న్యాయస్థానాలను వదలివేసి దక్షిణ దేశంలో ప్రకాశం, రాజాజీగార్లు ఉద్యమంలోకి దూకారు. ప్రజానీకాన్ని సహాయ నిరాకరణోద్యమ సిద్ధాంత పరిధిలో నడపటానికి ఉద్దేశించి, ప్రకాశం పంతులు గారు "స్వరాజ్య" అనే పేరుతో ఆంగ్ల దిన పత్రిక నొకదాన్ని ప్రారంభించారు. ఇది 1921లో. రాజాజీ వద్దనుండి కూడా సంపూర్ణ సహకారం లభించింది. ఆంగ్ల పత్రిక ప్రారంభమైన కొలది వారాల్లోనే తమిళ, తెనుగు సంచికలు కూడా వెలువడ్డాయి. యావద్దక్షిణ భారత ప్రజానీకంలో సమధికోత్సాహం పరవళ్ళు త్రొక్కింది.

భారత దేశ పత్రికా రంగంలో అనతి కాలంలోనే "స్వరాజ్య" పత్రిక తన ప్రత్యేకతను నిలబెట్టుకొని "ఇదిరా పత్రిక" అనిపించుకుంది. ప్రజాభిప్రాయానికి, ఉద్యమోత్సాహానికి దర్పణంగా నిలిచి పనిచేసింది. సామాన్య ప్రజల సమస్త శక్తి సంపదలు, అప్పుడప్పుడే తీగలు సాగుతున్న వారి ఆశలు. ఆశయాలు అందులో ప్రతిఫలించాయి.



శ్రీ ఎన్. సంజీవరెడ్డి శ్రీ ప్రకాశం — 1954 లో కర్నూలులో
స్వాతంత్ర్య దినోత్సవాల సందర్భంలో తీసిన ఛాయాచిత్రం

అన్నింటికంటె మిన్నగా సంపాదకుడు శ్రీ ప్రకాశం గారి ఎనలేని కార్యదీక్షకూ, మొక్కవోని ధైర్య సాహసాలకూ ప్రత్యక్ష చిహ్నంగా పత్రిక వృద్ధిపొందింది. ఈ విధంగా ఒక్క పుష్కర కాలం పాటు స్వరాజ్య పత్రిక తన ప్రభావాన్ని నలుదిక్కుల ప్రసరింపజేస్తూ, వ్యతిరేక పరిస్థితులతో యుద్ధం చేస్తూ, అజేయంగా అప్రతిహతంగా పురోగమించింది. కాని పరిస్థితుల ప్రాబల్యానికిలోనై, ఒకానొక సమయంలో కోర్టువారి ఇంజక్షను ఉత్తరువుల ప్రకారం పత్రిక ఆగిపోవలసి వచ్చింది.

## పత్రిక చివరి రోజులు

"సిరాదారి" అనే తన ఉద్గ్రంధంలో శ్రీ కె ఈశ్వర్ దత్తు గారు ''స్వరాజ్య'' పత్రిక చిట్టచివరిరోజులను గూర్చి యిలా రాశారు. (ఆయనకూడా ''స్వరాజ్య'' పత్రికలో కష్ట నష్టాలు రుచి చూచిన వాడే )

"ఆయన (ప్రకాశం) ధైర్య సాహసాలకూ, దయా స్వభావానికీ మేము ఆయన్ను ఎంతగానో ప్రేమించేవారం. దేశ స్వరాజ్యం మాట అలావుంచి,''స్వరాజ్య''పత్రిక కోసం ఆయన ఎంత శ్రమపడ్డాడు! తన సర్వస్వం ధారపోశాడు. ఈ పత్రికాభివృద్ధికి ప్రజాధనం వెచ్చించబడినా సరే లోకం అంతగా పట్టించుకోలేదంటే, ప్రజలకు ఆయనయందుగల అభిమానమే కారణం. కార్లైలు బ్రతికివుంటే ప్రకాశం గారిని తన 'వీర పురుషుల' జాబితాలో చేర్చుకుని గౌరవించేవాడు. ప్రకాశంగారిలాగా జీవితపథంలో నిర్భయంగా నడిచిన వాడు లోకం దృష్టిలో మరొకడు లేడు."

## నిర్భయత్వం

అధికారపదవిలో వుండగా శ్రీ ప్రకాశంగారి వ్యక్తిత్వం బహుధా గోచరించింది. ఆయన మహా పౌరుషశాలి; పార్టీకి ఎదురు తిరిగే మనిషి. తనను యిలా చేయమని ఒకరు శాసించేదేమిటి! ఇటువంటి స్వభావంవల్ల ఆయనకూ, పార్టీ అధిష్ఠానవర్గం వారికీ ఒక్కొక్కప్పుడు పడేది కాదు. అధిక సంఖ్యాక ప్రజల అభీష్టానుగుణంగా, వారి క్షేమాన్ని కాంక్షించి, తన అంతరాత్మ ఎలా ప్రబోధిస్తే అలా నడుచుకునేవాడు శ్రీ ప్రకాశం.

మద్రాసులో మొట్టమొదటి రాజాజీ మంత్రివర్గంలో, రెవిన్యూ మంత్రిగా వున్న సమయంలో తమిళ నాయకుడు రాజాజీకి తెనుగు సింహం ఏ మాత్రం తీసిపోదనిపించు కున్నాడు. జమీందారీ రద్దు కమిటీ అధ్యక్షుడుగా 13 సంపుటాల బృహన్నివేదిక తయారుచేసి ఆనాడు ప్రజల్లో అంతర్గర్భితంగా ఉన్న "దున్నేవాడికే భూమి" అనే ఆశయానికి ప్రాణ ప్రతిష చేశాడు. ఈ నివేదిక ప్రకటిస్తే దేశంలో పెద్ద తుఫాను చెలరేగుతుందనే భయం వుండనేవుంది. తెలివి తేటలకు పేరుమోసిన రాజాజీ యీ నివేదికాంశాలను బయటకు పొక్కనియ్యలేదు. శాసనసభలో చర్చకూడా జరక్కుండాచేసి, దానిని బుట్టదాఖలా చేశాడు. అనంతర కాలంలో జమీందారీ రద్దు పథకాన్ని విజయవంతంగా అమలు పరచే అవకాశం కీ॥శే॥ శ్రీ కళా వెంకటరావు గారికి లభించింది. ప్రకాశం కమిటీ రిపోర్టు ఆధారంగానే శ్రీ కళా తన పథకానికి మెరుగులు దిద్దుకున్నాడు. ప్రకాశం గారు నాటిన బీజం పెరిగి పెద్దదై మహా వృక్షమై ఫలవంతమైనట్లుగా జమీందారీ రద్దు చట్టం అవతరించింది.

మద్రాసు ముఖ్యమంత్రిగా శ్రీ ప్రకాశం కమ్యూనిస్టులకు ప్రథమ శత్రువు. ఆ రోజుల్లో కమ్యూనిస్టులు రజాకార్లతో చేతులు కలిపి మద్రాసు-హైదరాబాదు సరిహద్దు ప్రాంతాలను భయభ్రాంతం చేశారు. ఇదంతా ''పోలీసు చర్య''కు పూర్వపుమాట. ముఖ్యమంత్రిగా శ్రీ ప్రకాశంగారు కమ్యూనిస్టులు విసిరిన సవాలును ఎదుర్కొన్నారు. మితిమీరి పోతున్న కమ్యూనిస్టు దౌర్జన్యాలకు సమాధానంగా అప్పుడు ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం అమల్లోకి వచ్చింది.

తమ తమ ఇబ్బందులను ఎదుర్కొటానికి మద్రాసు రాష్ట్రాన్ని అనుసరించాయి అనతికాలంలోనే అనేక రాష్ట్రాలు. ప్రకాశంగారి మనసులో తోచిన యీ ఆలోచన-ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం-అన్ని రాష్ట్రాల్లో వెలిసింది. అయిదేండ్ల అనంతరం, సర్దార్ పటేల్ దేశ ఆంతరంగిక శాఖా మాత్యులుగావున్న సమయంలో, అది కేంద్ర చట్టంగా కూడా రూపొందింది. దేశంలోని ఇతర న్యాయస్థానాల మాటెందుకు?-చివరకు సుప్రీంకోర్టువారు కూడా యీ చట్టంలో ఒక్క లోపాన్నికూడా వ్రేలెత్తి చూపలేక పోయారంటే, దానిని ఆలోచించిన విధానం, తయారుచేసిన పద్ధతి అంత పకడ్బందీగావుందన్నమాట. ఇది శ్రీ ప్రకాశంగారి చట్ట నిర్మాణ కౌశలానికి చెప్పుకోదగిన ఉదాహరణ.

## శ్రీ ప్రకాశం రాజనీతి చతురత

1953 చివరలో నూతనంగా ఆవిర్భవించిన ఆంధ్ర రాష్ట్రానికి శ్రీ ప్రకాశంగారు సారధ్యం వహించిన సమయంలో ప్రధాన ప్రతిపక్షమైన కమ్యూనిస్టుల సవాలును తిరిగి పార్లమెంటరీ రంగంలో ఎదుర్కొవలసి వచ్చింది. కమ్యూనిస్టు ప్రమాద నివారణ కార్యక్రమాన్ని శ్రీ ప్రకాశంగారు కేవలం ఆంధ్రరాష్ట్ర పరిధిలోనే కాకుండా యావద్భారత దృష్టితో ఆలోచించారు. ప్రజలకు కమ్యూనిస్టు విషం తలకెక్క కుండా నివారించాలంటే వారి ఆర్థిక పరిస్థితిని చక్కబరచి, సంతృప్తి కలిగించటమొక్కటే సరియైన మార్గమని ఆయన దూరదృష్టితో నిర్వహించాడు.

ఈ ఉద్దేశంతోనే ఆయన ఆంధ్రరాష్ట్రంలో అనేక విప్లవాత్మక సంస్కరణలకు అంకురార్పణ చేశాడు. ఆయన తీవ్ర సంస్కరణాభిలాష దేశంలో ఉప్పెనలా పొంగింది. భూమిశిస్తు మాఫీ, బీదలకు భూముల పంపిణీ, ఖైదీలకు క్షమాదానం. అభ్యుదయసాధకములైన ప్రాజెక్టుల నిర్మాణం, గ్రామ స్థాయినుండి పథక నిర్మాణ కార్యక్రమం మొదలైన చర్యలు పరిపాలనా వ్యవస్థలో కలిగిన ప్రశాంత విప్లవానికి తొలి బీజాలు. భారతదేశం రాజకీయరంగంలో వీటివల్ల అనేక విధాలుగా ప్రభావితమైంది.

## ఒక మధుర క్షణం

వీటన్నింటినీ ఆచరణలో పెట్టి చూపించటానికి ఆయన ఎక్కువకాలం అధికారంలో లేడు. అయితేనేం? చుక్కాని పట్టినవాడు, మార్గదర్శిగా ముందు దారిచూపినవాడు ఆయనే. ఒకప్పుడు ఆంధ్రరాష్ట్రం భారతదేశంలో "కమ్యూనిస్టుల కంచుకోట''గా ఉండేది. నేడు కాంగ్రెసుకు బలమైన రాష్ట్రం. రా బో యే కాలంలో ''ఆంధ్రప్రదేశ్'' అనే పేరుతో ఏర్పడబోయే సమగ్ర రాష్ట్రంలో, ప్రజా జీవితం సుఖమయంగా ఉండటానికి ఆనాడే మార్గాలు అన్వేషించి, పరిష్కార బీజాలు వెదజల్లి, పారిజాతపు మొక్కలునాటిన శ్రీ ప్రకాశంగారి దీక్షకి ఆంధ్రజాతి జోహార్లర్పిస్తుంది.

అది 1954 నవంబరు 13వ తేదీ. ప్రకాశం మంత్రివర్గం పడిపోయింది. గెలిచివస్తున్న అభిమన్యుడిలా ఆయన అధికారం వదలి వచ్చాడు. కీర్తిపరివేషనవలయితుడైన "తెనుగు

సూర్యుడు"లా ప్రకాశం ప్రకాశిస్తూ బైటికి వచ్చాడు. అది ఆయన జీవితంలో ఒక మధురక్షణం.

1952 మే 6వ తేదీన ఆంధ్ర రాష్ట్ర రాజకీయ చరిత్ర కొత్త అధ్యాయం రాసుకుంది. మద్రాసు గవర్నరు శ్రీ ప్రకాశ ఉభయ సభల సంయుక్త సమావేశంలో ప్రసంగించడానికి లేచాడు. ప్రకాశంగారు కూడా లేచాడు. గవర్నరు ప్రసంగాన్ని ఆపి, ప్రకాశం చరిత్రాత్మకమైన ప్రకటన చేశాడు. లోపల శాసన సభ్యులు, బైట ప్రజలు ''భేష్'' అన్నారు. అత్యాశ్చర్యకరమైన యీ సంఘటనకు చివరకు పార్లమెంటరీ ప్రజ్ఞానిధి "మే" వ్రాసిన గ్రంథం కూడా జవాబు చెప్పలేక పోయింది. తరువాత వారం రోజులకు రాజాజీ అభిశంసన తీర్మానం ప్రవేశపెట్టుకున్నా, జరుగవలసిన విధ్వంసం జరిగిపోయింది. గవర్నరు శ్రీ ప్రకాశ రాజాజీని ముఖ్యమంత్రిగా ఆహ్వానించటం, తనను వ్యక్తిగతంగా అవమానపరచటం, కమ్యూనిస్టుల సహకారంతో తనకు లభించిన అధిక సంఖ్యాకబలాన్ని వమ్ముచేసి, అధికార స్వీకరణకు తనకుగల హక్కులను త్రోసి రాజనటమేనని 'ఆంధ్రకేసరి' గర్జించింది. 1949-50 మధ్యకాలంలో మద్రాసు శాసనసభలో శ్రీ ప్రకాశం నిర్వహించిన పాత్ర అద్వితీయమైనది. మద్రాసు మంత్రులమీద ఆయన మోపిన అభియోగాలు, వాటికి ఋజువుగా ఆయన తెలిపిన విషయాలు, ఉదాహరణలుగా పేర్కొన్న విశేషాలు, —ఇవన్నీ చరిత్రలో ప్రధానాంశాలుగా రూపొంది నేటికీ ప్రజల స్మృతిపథంలో మెదుల్తూనేవున్నవి. ఉమ్మడి మద్రాసు రాష్ట్ర మంత్రి వర్గంలోని ముఖ్యులైన వారి మీద ఆయన తీవ్రమైన నేరారోపణలు చేశాడు. వీటికి యావద్భారత ప్రఖ్యాతి లభించింది. అద్భుతం, ఆశ్చర్యం తాండవించిన రోజులవి. నేరారోపణల తుది ఫలితం ఏమవుతుందోనని ఆదుర్దా అన్నిచోట్లా కనిపించేది. అటువంటి విచిత్రమైన రోజులు మళ్లీరావు. ఆనాటి నాయకులంతా రంగం నుండి నిష్క్రమించారు.

## దక్షిణ భారత అగ్రనాయక త్రయం

1950ప్రాంతంలో-అంటే యీ శతాబ్దపు మధ్యకాలంలో దక్షిణ భారతావనిలో శ్రీయుతులు రాజాజీ, పట్టాభి, ప్రకాశం గార్లు అగ్రనాయక త్రయంగా రాణించారు. ఒక అర్ధ శతాబ్దంపాటు ఆంధ్రుల హృదయ సామ్రాజ్యాలను మకుటం లేని మహారాజుగా శ్రీ ప్రకాశం పాలించాడు. రాజకీయపుఆటలో ఓటమి ఎరుగని ధీరుడుగా అభినందనలు అందుకున్నాడు. ఏ యితర ఆంధ్ర నాయకుడు కూడా బహుశః ఆయనతో సమ ఉజ్జీ కాలేదు. దక్షిణ భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో దశాబ్దాలుగా సాగిన ప్రకాశం-రాజాజీ పోటీ మరపురాని ఉజ్వలమైన ఘట్టం. ఈ పోటీ తీవ్రంగా ఉంటే, ఒక వజ్రం ఇంకొక వజ్రాన్ని ఛేదించటానికి చేసే ప్రయత్నమా అనిపించేది. రాజాజీకి హృదయం కంటే ఆలోచన ముఖ్యం. ప్రకాశం హృదయస్పందనపై ఆధారపడిన ఉద్రేకి, ఆంధ్రుల సహజ భావాలకు ఒక నిర్దిష్టమైన రూప కల్పనే ప్రకాశం. గుండె నిబ్బరం, ఆత్మవిశ్వాసం ప్రకాశంలో మూర్తీభవించినట్లనిపించేది.

ఆంధ్ర కేసరి గుండెలో ఎంత మృదుత్వం గూడుకట్టుకుని వుందో ఆయనకు ఆత్మీయులైన ముఖ్యానుచరులకే తెలుసు. అందరికంటే ముందుగా, బిగ్గరగా చివరకు జాతిపిత గాంధీజీ కంటే కూడా — కుండ బ్రద్దలు కొట్టినట్లు నిజం చెప్పటం ఆయన ప్రత్యేక లక్షణం. అలా చెప్తే వచ్చే దుష్ఫలితాలేమిటా అనే వెనుక చూపు ఆయనకు ఏ కోశానా లేదు. శ్రీ ప్రకాశం ఆ జన్మవీరుడు. అనుక్షణం పోరాటంతో పాలనాధికారాన్ని, ప్రజాభిమానాన్ని చూరగొన్న వాడు. దేశంలో అగ్రనాయక స్థాయి అందుకున్న వాడు. తాను తలచుకొన్న పని చేసితీరిన వాడు. ఆయన ఒక్కడే ఆంధ్రజాతి సానదీర్చిన రత్నం. రత్నద్యుతులతో ముందు దారిచూపించిన త్యాగి. ఆంధ్రమాత కంఠహారంలో అపురూపమైన నాయకమణి.

— (స్వీకృత వ్యాసం) —

# ఉట్నూరు బహూశార్థ సాధక ప్రాజెక్టు

దయలేని ప్రకృతి మాతతో, గిరిజనుల్లో తరతరాలుగా వేళ్ల పాతుకున్న అజ్ఞానంతో, మూఢ విశ్వాసాలతో నిరంతర సమరమే ఆదిలాబాద్ జిల్లాలోని ఉట్నూరు బహూశార్థసాధక ప్రాజెక్టు చరిత్రలో ప్రధానాంశం. ఈ పోరాటం క్రమేణా మంచి ఫలితాలను యివ్వటం ప్రారంభించింది. అభ్యుదయ పథంలో వెలుగు మార్గమేదో గిరిజనులు క్రమక్రమంగా నేర్చుకుంటున్నారు. గ్రామ జీవితానికి మెరుగులు దిద్దే సంకల్పంతో స్థానిక అవకాశాలను సంపూర్ణంగా వినియోగించుకోగల శక్తి సామర్థ్యాలు, నేర్పుగల కొత్త నాయకత్వం గిరిజనుల్లో తయారవుతున్నది.

ఆదిలాబాదు జిల్లాలోని ఉట్నూరు తాలూకా కంతటికీ పరివ్యాప్తమై యీ ప్రాజెక్టు కార్యక్రమం కొనసాగుతోంది. ఈ తాలూకా, జిల్లాకు మధ్యస్థంగా వుంది. గ్రామాలసంఖ్య 167. విస్తీర్ణం 726.40 చ. మై. జిల్లాలోని 10 తాలూకాల్లో ఏడింటి కంటె యీ తాలూకా పెద్దది. అయినా జనాభా విషయంలో అన్నింటి కంటె చిన్నది. సౌకర్యాలు ఏమీ లేవు. ఉట్నూరు బాగా వెనుకబడిన ప్రాంతం. శీతోష్ణ స్థితి అనుకూలంగా వుండదు. దట్టమైన అడవులతో క్రూర మృగాలతో తాలూకా తాండవిస్తుంటుంది. దారిద్ర్యం, నిరక్షరాస్యత యీ ప్రాంతంలో సర్వత్రా వ్యాపించాయి.

తాలూకా భౌతిక స్వరూప పరిస్థితులను బట్టి, తాలూకాలో వివిధ ప్రాంతాలకు చేరుకోటానికి వీలైన మార్గాలను బట్టి, దీనిని మూడు నైసర్గిక మండలాలుగా విభాగించుకోవచ్చు. మొదటిది పశ్చిమ—నైఋతి ప్రాంతం. యిది చాలా భాగం మైదానం. రెండవది, ఉత్తర—ఈశాన్య ప్రాంతం. మూడవది తూర్పు—ఆగ్నేయ మండలం. చివరి రెండు మండలాలు దాదాపు పూర్తిగా కొండ ప్రాంతాలు. వాగులు వంకలతో నిండి వుంటాయి. గిరిజనులు అధిక భాగం యీ రెండు మండలాలలోనే నివసిస్తూవుంటారు. ఉట్నూరులో మామూలుగా ఏటేటా 50 అంగుళాల వర్షం పడుతుంది. గరిష్ఠ ఉష్ణోగ్రత 112 డిగ్రీలు. కనీస పరిమితి 65 డిగ్రీలు.

గ్రామాలను చూసీచూడగానే యిది వెనుకబడిన ప్రాంతమని సులభంగా తెలుసుకోవచ్చు. లోపలి భాగంలోని గ్రామాలలో పక్కాగా నిర్మించిన యిండ్లు గానీ, పెంకుటిండ్లు గానీ, కచ్చా నిర్మాణాలు గానీ వుండవు. ఇండ్లన్నీ తడికల గదులతో, పూరి గడ్డి కప్పులతో వుంటాయి. గ్రామాలలో జనాభా చాలా స్వల్పం. అదైనా అక్కడక్కడ అనేక శివారు గ్రామాల్లో వుంటుంది. ప్రతి శివారు గ్రామంలో చాలా కొద్ది గుడిసెలు మాత్రమే వుంటాయి. అనేక గ్రామాల్లో ఆరోగ్యకరమైన మంచి నీరు కూడా దొరకదు. ఎక్కడో కొన్ని చోట్ల మినహాయిస్తే గ్రామాల్లోని బావులకు చుట్టూ కట్టకూడా వుండదు, తరచుగా బావులమీద కొయ్య మొద్దులు వేసి వుంటాయి. తాలూకాలోపలి భాగంలోని గ్రామాల్లో వాగులు వంకల్లో, ఒడ్డుల ప్రక్కల్లో చెలమలు త్రవ్వుకుని నీరు తెచ్చుకోవటం అలవాటు.

## రహదార్లు

ఉట్నూరుకు మంచి పక్కా రోడ్డు ఒక్కటే వుంది. తాలూకా పశ్చిమ భాగం ద్వారా యీ రోడ్డు ప్రారంభమై తాలూకా ముఖ్య పట్టణమైన ఉట్నూరు వరకు 20 మైళ్ళ పొడవున వుంటుంది. జిల్లా ముఖ్య పట్టణమైన ఆదిలాబాదుకు గానీ, తాలూకా వెలుపల యితర ప్రాంతాలకు గానీ పోవాలంటే యిది ఒక్కటే రోడ్డు. వర్షాకాలంలో నైతే తాలూకా లోపలి ప్రాంతాలకు చేరటమే కష్టం. ఈ ప్రాంతమంతా కొండలు కోనలతో నిండి వుంటం చేతనూ

యిక్కడ మిట్టపల్లాలు ఎక్కువ కావటం చేతనూ, మంచి రోజుల్లో కూడా ఎద్దుల బండ్ల మీద ప్రయాణం కష్టంగానే వుంటుంది.

## జనాభా

సర్వే లెక్కల ప్రకారం ఉట్నూరు తాలూకా జనాభా సుమారు 40,500 తాలూకాలోని పటుంబాల సంఖ్య 8500 1951లో జనాభా 35 వేలు మాత్రమే ఆ తర్వాత జనాభా పెరిగింది. స్థానికంగా జనాభా పెరగటమే కాకుండా, కిన్‌వాట్, బోధ్, ఆదిలాబాద్ మొదలగు తాలూకాల నుండి కూడా ప్రజలు వచ్చినట్లు లెక్కల ద్వారా తెలుస్తుంది జనాభాలో అధిక సంఖ్యాకులు గోండు జాతి ప్రజలు వీరు కాక యింకా కోలములు, లోహేలు, పార్ధనులు, నాయకపోడులు మొదలగు జాతుల వారు కూడా వున్నారు. 1951 జనాభా లెక్కలను బట్టి గిరిజన జనాభా 25 వేలు. అంటే మొత్తం జనాభాలో మూడింట రెండు వంతులు. ఇప్పటికీ జనాభాలో గిరిజనులు అదే దామాషాలో వుంటారు. జనాభా పెరిగినప్పటికీ జనసాంద్రత మాత్రం చాలా తక్కువే. సుమారుగా చదరపు మైలు 1కి 56 మంది మాత్రమే నివసిస్తున్నారు.

ఈ ప్రాంతమంతటా జనాభా చాలా పల్చగా వుంటుంది. మొత్తం యిక్కడ వున్న 150 గ్రామాలకు గాను 100 గ్రామాల్లో సగటున ఒక్కొక్క దానిలో 400 మంది కంటె తక్కువగానే వుంటారు. రెండు వేలకు మించిన జనాభా గల గ్రామం ఉట్నూరు ఒక్కటే. దీని జనాభా 2135,



గోండు స్త్రీ



గోండు నృత్యం

## విద్య

ఇక్కడ నిరక్షరాస్యత తాండవిస్తుంటుంది. బహూకార్థ సాధక ప్రాజెక్టు ప్రారంభమైన రోజుల్లో విద్యాశాఖ సాంఘిక సేవా శాఖలు నిర్వహించే పాఠశాలలతో కూడా కలిసి మొత్తం 37 ప్రాథమిక పాఠశాలలు మాత్రం వుండేవి. ఉన్నత పాఠశాల లేదు. ఇటీవలనే ఉట్నూరులోని పాఠశాలలో 5వ తరగతి వరకు ఏర్పాటు చేసి దాని స్థాయి పెంచారు.

యిక్కడి ప్రజలు గోండి, కోలామి, ప్రధాని, నాయకపోడి, లంబాడి, మరాఠీ, హిందూస్థానీ, తెలుగు మొదలగు భాషలు మాట్లాడతారు. తాలూకా ముఖ్యపట్టణమైన ఉట్నూరులోనూ, ఉట్నూరు, ఆదిలాబాద్ రోడ్డు ప్రక్క గ్రామాల్లోనూ ప్రజలు తెలుగుభాష మాట్లాడుతారు. హిందూస్థానీ, మరాఠీ మాట్లాడేవారూ, యింకా కొన్ని గిరిజన భాషలు మాట్లాడే వారూ కూడా యీ గ్రామాల్లో వుంటారు. తాలూకా లోపలి భాగాల్లో కేవలం గిరిజన భాషలు మాత్రమే ప్రజలు మాట్లాడుతూ వుంటారు. కొద్దిమందికి మాత్రం, మరాఠీ, హిందూస్థానీ భాషలు తెలుసు. వీటిలో యింకా కొద్దిమందికి తెలుగు భాష వచ్చు. గిరిజన స్త్రీలు మాత్రం కేవలం వారి వారి భాషలే మాట్లాడుకుంటారు. పురుషుల్లోనే గిరిజన భాషలు కాక, మరాఠీ, హిందూస్థానీ వచ్చిన వారుంటారు. కాగా పాఠశాలల్లో ఏ భాషలో బోధించాలనేది చాలా గడ్డు సమస్య. 15 పాఠశాలలకు గాను రెండింటిలో మాత్రం విద్యాశాఖ వారు తెలుగు బోధన భాషగా ప్రవేశపెట్టగలిగారు. వాటిలో అంతకు ముందు మరాఠీ బోధన భాషగా వుండేది. మిగిలిన 13 పాఠశాలల్లోనూ మరాఠీ బోధనాభాష. సాంఘిక సేవా శాఖ వారి పాఠశాలలో బోధనభాష గోండి. దీనికి దేవనాగరి లిపి వాడతారు. మరాఠీ రెండవ భాషగా నేర్పుతారు.

ప్రాజెక్టు ప్రారంభమయ్యే నాటికి యీ శాఖవారు 22 పాఠశాలలు నిర్వహిస్తుండేవారు. మొత్తం పాఠశాలలలోని విద్యార్థుల సంఖ్య 1105. యిది 5-16 సంవత్సరాల వయస్సుగల బాల,బాలికల సంఖ్యలో 7వ వంతు మాత్రమే. మారల్‌వాయి ఉపాధ్యాయ శిక్షణ కేంద్రంలో శిక్షణ పొందిన ఉపాధ్యాయులను యీ పాఠశాలల్లో నియమిస్తారు. సాంఘిక సేవాశాఖ వారి పాఠశాలలకు యిదొక ప్రత్యేకత. మాజీ హైదరాబాదు రాష్ట్రంలో కొన్ని భాగాలలో గిరిజన జీవిత విధానాలను గూర్చి పరిశోధనచేసి, ప్రసిద్ధిగన్న క్రిష్టాఫ్ వాన్ ఫ్యూరర్ హైమెన్‌డాల్ఫ్ అనే ఆయన సిఫార్సులవల్ల యీ ఉపాధ్యాయ శిక్షణ కేంద్రం ఏర్పాటైంది. 1942లో గిరిజన సంక్షేమం కోసం, ఆయన సమర్పించిన నివేదికలోని అనేక ముఖ్యాంశాలలో, జిల్లా మధ్యభాగంలో వున్న మార్లవాయ్ వంటి చోట గోండు ప్రజలలోనుండి కొంతమందిని ఉపాధ్యాయులుగా తర్ఫీదు చేయాలనేది ఒకటి. ఆ విధంగా 1943 లో యీ గిరిజనోపాధ్యాయ కేంద్రం ప్రారంభమై యింతవరకు 200 మంది ఉపాధ్యాయులను తయారుచేసింది. ఆదిలాబాద్ జిల్లాలోని పశ్చిమ మండలంలోని అన్ని తాలూకాల అభ్యర్థులకు ఇక్కడ శిక్షణయిచ్చి, యీ ప్రాంతంలోని సాంఘికసేవా పాఠశాలల్లో వారిని నియమిస్తారు. యీ కేంద్రంలోని శిక్షణస్థాయి 7వ తరగతి వరకు మాత్రమే పరిమితంగా వుంది. దానితో వారికి సాంఘిక సేవా పాఠశాలలోని ప్రాథమిక తరగతులు విద్య బోధించే సామాన్య జ్ఞానం లభిస్తుంది.

## గిరిజన పంచాయతీలు

గిరిజన పంచాయతీలకు, గిరిజనుల వ్యవహారాలలో వాటికి వుండే అధికారాలకూ, కొంతవరకు ఆమోద ముద్ర వేయటానికి వీలుంచే చూడవలసిందని కూడా హైమెన్‌డాల్ఫ్ సిఫార్సు చేశాడు. దానితో పంచాయతీలకు ఆమోదం లభించింది. తాలూకానంతటినీ 4 పంచాయతీ మండలాలుగా విభజించారు. గిరిజనుల్లో వచ్చే అనేక రకాల తగాదాలను పంచాయతీలు విచారించి తీర్పు చెప్తూవుంటాయి.

వృత్తులు:— యితర చోట్ల లాగానే యిక్కడ కూడా వ్యవసాయం ప్రజల ముఖ్య జీవనోపాధి. యిక్కడి భూములు చాల భాగం నల్లరేగడ నేలలు. ఈ భూములకూ, చెలక భూములకూ నిష్పత్తి 7 : 1 గా వుంటుంది. యీ తాలూకా ప్రధానంగా ఖరీఫ్ పంట పండే ప్రాంతం. ముఖ్యమైన ఆహార పంట జొన్నలు. వ్యాపార పంట ప్రత్తి. గత మూడు సంవత్సరాల్లో ఖరీఫ్ సీజనులో జొన్నలు వరుసగా, 18 వేలు, 19 వేల 5 వందలు; 22 వేల యకరాల్లోనూ ప్రత్తి 17 వేల 7 వందలు, 19 వేల 5 వందలు, 19 వేల 5 వందల యకరాల్లోనూ పండించబడింది. మాగాణి పంట చాలా స్వల్పం. అదే కాలంలో నీటితో సాగైన మాగాణి పంట వరుసగా 400, 495, 700 యకరాల్లో పండించబడింది. నీటి సాగుకు చెరువులే ముఖ్యాధారం. భూమిని సారవంతం చేయటానికి రైతులు అంతగా శ్రద్ధ తీసుకోరు. ప్రత్తిని ఉపయోగించే పరిశ్రమగానీ, చేతి వృత్తులుగానీ లేవు. బండ్లమీద పంట తీసుకుపోయి యిక్కడికి సుమారు 30 మైళ్ల దూరంలోగల ఆదిలాబాద్‌లో అమ్ముకుంటారు. లోతట్టు గ్రామాల్లో ఎక్కువగా వడ్రంగులు, కమ్మరులు వుండరు. ఈ ప్రాజెక్టు ప్రాంతంలో దూడలతో సహా పశువుల సంఖ్య 40 వేలు.

## ఆరోగ్య పరిస్థితులు

మలేరియా నిర్మూలన దళాలు గట్టిగా పనిచేస్తున్నప్పటికీ అనేక సంవత్సరాలుగా యీ ప్రాంతంలో మలేరియా వ్యాధి ముఖ్యమైన బాధగా పరిణమించింది. యిటీవలి వరకు గిరిజనులను యాస్‌వ్యాధి బాగా వేధించేది. కాని యాస్ వ్యాధి చికిత్సా కార్యక్రమం ప్రారంభమైన దాది యీ వ్యాధి అదుపులోకి వచ్చింది.

## ప్రాజెక్టు ప్రారంభం

1956 ఏప్రియల్ 1వ తేదీన యీ ప్రాజెక్టు ప్రారంభమైందని చెప్పవచ్చు. కాని 1957 మే నాటికి గాని పనులు ప్రారంభం కాలేదు. అప్పటికిగాని అవసరమైన సిబ్బంది అందరూ రాలేదు. 1956 ఏప్రియల్ 1వ తేదీ నుండి పూర్తిగా 5 సంవత్సరాల పాటు యీ ప్రాజెక్టు కొనసాగుతుంది. 1957 లో వర్షాకాలానికి ముందుగా లభించిన స్వల్ప వ్యవధిలో సర్వే పనులు, యితర ప్రాథమిక చర్యలు గైకొనబడ్డాయి. తిరిగి పనులు చేయటానికి ఈ ప్రాంతంలో సంవత్సరానికి 6 నెలలు మాత్రమే కాలం అనుకూలంగా వుంటుంది. పైగా రాకపోకల సౌకర్యాలు లేకపోవటం ఒక పెద్ద యిబ్బంది.

## ప్రాథమిక దశలో ఇబ్బందులు

మొదట్లో సిబ్బందికి నివాస గృహాలు సమకూర్చుకోవటం పెద్ద సమస్యగా తయారయింది. వానకూ, శీతోష్ణ పరిస్థితులకూ తట్టుకో లేని చిన్నచిన్న గుడిశెల్లో వారు అద్దెకు వుండవలసి వచ్చింది. గ్రామాల్లోని యిండ్లలో చాలా భాగం పూరిగుడిశెలైనందున గ్రామసేవకులు వాటిలో వసతి ఏర్పాటు చేసుకోవటం చాలా కష్టమయింది. లోగడ దేశంలో నాలుగు మూలలకూ ప్రాకిన యిన్‌ఫ్లుయెంజా వ్యాధి ఉట్నూరుకు కూడా ప్రాకింది. మొదట్లో అక్కడ ఏ విధమైన వైద్య చికిత్సా సౌకర్యాలు వుండేవి కావు. తాలూకా ప్రధాన పట్టణంలోనే డాక్టర్ లేడు. కొన్ని సమయాల్లోనైతే సిబ్బందిలో వ్యాధి సోకిన వారిని ఆదిలాబాద్ తీసుకు వెళ్ళవలసి వచ్చేది. అసలు యీ ప్రాంతమంటేనే సిబ్బందికి వెగటు, భయం పుట్టింది. సెలవులు పెట్టి వెళ్ళుదామనే వారి ప్రయత్నం ఆపశక్యం కాలేదు. రాను రాను యీ యిబ్బందులు అన్నీ క్రమేణా తొలగిపోయి, యిక్కడి పరిస్థితులకు సిబ్బందిలోని వారందరూ అలవాటు పడ్డారు.

తితిగి పనులు చేసుకునే విషయంలో గ్రామాల్లో భాష సమస్య కూడా ఒక ప్రతిబంధకమైంది. గ్రామ సేవక మండలాలు కొన్నింటిలో గిరిజన భాషలు జనాభాలో పరిమితంగానే ప్రచారంలో వున్నాయి. మరాఠీ, హిందూస్థానీ భాషలు కూడా అంతే. గిరిజనులతో సంబంధాలు ఏర్పాటు చేసుకోటానికే సిబ్బందికి కష్టమయ్యేది. కాని క్రమేణా గ్రామ సేవకులు గిరిజనుల భాషను నేర్చుకుని అర్థం చేసుకోటానికి మొదలు పెట్టారు. వారి కార్యస్థానాలు తాలూకా ముఖ్యపట్టణానికి ఎంతో దూరంలో వుంటూ అక్కడికీ యిక్కడికీ రాక పోకలు చాలా కష్టంగా జరుగవలసి వచ్చింది. ఉన్న దారులన్నీ అరణ్యంలో గుండానే. క్రూర జంతువుల వల్ల ప్రాణభీతి కూడా లేక పోలేదు.

శివారు గ్రామాలు ఒకదానికొకటి దూరంగా ఉండటంతో ప్రాజెక్టు పథకాలు అమలు పరచటంలో చాలా కష్టం కలుగుతుండేది. పైగా గిరిజనుల్లో చీటికీ మాటికీ అటూయిటూ వెళ్ళి నివాస స్థానం మార్చే అలవాటు వుంది. యిటీవల కొంతవరకు తగ్గినా యింకా యిది యిప్పటికి ఉందనే చెప్పాలి. వ్యాధి వ్యాప్తి, పంటల నాశనం మొదలగు అనేక విషయాల్లో వారికి మూఢవిశ్వాసాలు మెండు. పొలాలకు దగ్గిరలో వుండాలనే కోర్కెతో వారు అటుయిటు నివాసం మార్చుకుంటూ వుంటారు. కొన్ని సంవత్సరాల తర్వాత భూసారం తగ్గిపోతే పొలాలను వదలి వెళ్తారు. మంచి పొలాలు వెతుక్కుంటారు. యిటువంటి పరిస్థితుల్లో ప్రాజెక్టు ద్వారా తలపెట్టిన బహుముఖ కార్యక్రమాలు నిర్వహించటం చాలా కష్టం. దూర దూర ప్రదేశాల్లో అక్కడొకటీ. యిక్కడొకటీ గుడిశెలతో గ్రామాలు కాకుండా ఒక మోస్తరు పెద్ద పల్లెలు ఏర్పాటై వుంటే కార్యక్రమాలు అమలు పరచటం సులువు. అందువల్ల యీ కుగ్రామాలను మార్పుచేసి పెద్ద గ్రామాలుగా తయారు చేయటం అవసరం. ఈ పథకం ప్రాధాన్యాన్ని గిరిజనులు కూడా గుర్తించారు. పెద్ద గ్రామాల నిర్మాణానికి సుముఖత్వం చూపుతున్నారు. కొన్ని గ్రామాల విషయంలో పథకాలు కూడా పూర్తి అయినవి. శివారు గ్రామాల ప్రజలు, పెద్ద గ్రామాలకు తరలి రావటానికి ప్రాజెక్టు పథకాల ద్వారా సహాయం అందజేయ బడుతుంది. పాతశాలలు, మంచి నీటి బావులు, నలుగురూ కలిసే కూడలి స్థలాలు, అందరికీ ప్రయోజనకరంగా ఆరోగ్య కార్యక్రమాలు, యింకా అభివృద్ధి నిమిత్తం ఉద్దేశించిన అనేక కార్యక్రమాలు చిన్న చిన్న శివారు గ్రామాలు కంటే పెద్ద గ్రామాలుగా వుంటే సులభంగా ప్రారంభించి పూర్తి చేసుకోవచ్చు.

## గిరిజనుల సుముఖత

క్రమేణా ప్రాజెక్టు పథకాల పట్ల గిరిజనుల సుముఖత ఎక్కువవుతూ వుంది. గిరిజనులు తమ గ్రామాలలోని పటేలు, లేక హెడ్‌మన్ చెప్పే మంచి సలహాల ప్రకారం నడుచుకునే అవకాశాలు కల్పించటం అవసరం. గిరిజనుల్లో వారికి మంచి పలుకుబడి వుండటం చేత పటేలు, హెడ్‌మన్‌వంటి పెద్దలతో సంబంధాలుపెట్టుకుని పనిచేస్తే పనులు తేలిగ్గా జరగటానికి వీలుంటుంది. గత ఖరీఫ్ సీజనులో మెట్ట పొలాల్లో రసాయనిక ఎరువులు వేసే కార్యక్రమాన్ని చాలా మంది గిరిజనులు ప్రారంభించారు. దీని ప్రయోజనాన్ని పటేళ్ళు గుర్తించిన తర్వాతనే యీమార్పు జరిగింది.

కంపోస్టు గుంటలు త్రవ్వటం, పాఠశాలలకు గుడిసెలు నిర్మించటం, వీలైన చోట్ల పాఠశాలల్లో ఫర్నిచర్ ఏర్పాట్లు కూడా జరిగాయి. శ్రమదానం చేయవలసి వస్తే గిరిజనులు వెనుకడుగు వేయరు. గ్రామాలను యిప్పుడు కొంత వరకు పరిశుభ్రంగా వుంచుకుంటారు.

## ప్రాజెక్టు కార్యకలాపాలు

1957 మే నెలలో ప్రాజెక్టు ప్రారంభమైనప్పుడే వ్యవసాయ తరుణం కూడా ప్రారంభమైంది. రైతులకు సప్లయి చేయటానికి ఎరువులు, మేలు రకం విత్తనాలు ఎంతెంత అవసరమో అంచనాలు త్వరగా తయారు చేశారు. జపాను వరి సాగు పద్ధతి అమలు పరచటానికి ఒక పథకం సిద్ధం చేయబడింది. సుమారు 60 యకరాలు గల రైతులను యీ పద్ధతికి ఒప్పించటం జరిగింది. పొలాలకు నీరు పెట్టుకోటానికి ఉట్నూరులో కేవలం చెరువులే ఆధారం. అందువల్ల నారు పెంచటానికి చెరువు నీరు లభ్యమవుతుందా కాదా అనే దాని మీదే నీటి సాగు ఆధారపడి వుంటుంది. 1957లో వర్షాలు ఆలస్యంగా పడ్డాయి. అందువల్ల జపాను వరి సాగు విధానం క్రింద నారు పెంపకానికి రైతులు సిద్ధపడినా చెరువులో ముందచేదు బాపతు నీరు చాల్లేదు. ఒక రైతువద్ద మూడెకరాల విస్తీర్ణం తీసుకుని భారీ ఎత్తున అందరికీ పనికి రావటానికి నారు పెంచటం జరిగింది. ఈ నారు 60 యకరాల్లో నాటటానికి సరిపోయింది.

ఈ పద్ధతి వ్యవసాయం చాలా ప్రోత్సాహకరంగా సాగింది. యిక్కడి మామూలు పద్ధతిలో వ్యవసాయం చేస్తే యకరానికి 12 నుండి 17 మణుగుల వరకూ ధాన్యం పండుతుండేది. కాని కొత్త పద్ధతి వ్యవసాయంలో దిగుబడి యింత కంటే చాలా ఎక్కువగా వుంది. హెచ్.ఆర్. 35 అనే రకం ధాన్యం ఒక పొలంలో గుంటకు 73 శేర్ల గరిష్ఠ పరిమితిలో పండింది.

అధునాతన పద్ధతులకు సంబంధించిన వ్యవసాయ విధానాలను ప్రచారం చేయటానికీ, మేలు రకం విత్తనాల వాడకాన్ని ఎక్కువ చేయటానికీ ప్రతి గ్రామ సేవక మండలంలో ఒక ఆదర్శ విత్తనాల ఉత్పత్తి క్షేత్రం నెలకొల్పారు. వీటిలో హెచ్ క్వార్టర్సులో వరి విత్తనాలకూ, యితర కేంద్రాలలో ప్రత్తి, జొన్న విత్తనాలకూ సంబంధించిన క్షేత్రాలు నెలకొల్పబడి పనిచేస్తున్నవి. ప్రాజెక్టు ప్రాంతంలో దాదాపు వందకు పైగా ప్రదర్శన క్షేత్రాలు ఏర్పాటైనవి. వీటిలో భారత వ్యవసాయ పరిశోధన సంస్థ వారి పథకం క్రింద ఏర్పాటైనవి కూడా వున్నాయి. వ్యవసాయం, ఎరువులు, పంటల రకాలు మొదలగు వాటికి సంబంధించిన ప్రదర్శనలు కూడా ఏర్పాటు చేయబడినవి. ఈ ప్రాంతంలో పండ్లు, కూరగాయలు బహుస్వల్పంగా పండిస్తారు. వీటిని ఎక్కువగా వుత్పత్తి చేయాలని ప్రచారం చేయదలచుకుంటే, సకాలంలో సరియైన విత్తనాలు, నారు, పండ్ల మొక్కలు రైతులకు అందించ గలిగి వుండాలి. యిందుకోసం పండ్లు, కూరగాయల నర్సరీ ఒకటి ప్రాజెక్టు ప్రాంతంలో నెలకొల్పబడుతున్నది. ఈ నర్సరీకి నీటి సప్లయి చేయటానికి వుద్దేశించిన బావి నిర్మాణం పూర్తి కావస్తున్నది. ఈ లోగా పెరటి తోటల పెంపకం కోసం కూరగాయల విత్తనాలను తగినంత మొత్తంలో రైతులకు సప్లయి చేయబడినవి. అదే విధంగా పండ్ల మొక్కలు కూడా గ్రామాలకు సప్లయి చేశారు. వీటితో 48 యకరాలలో తోటలు వేయబడినవి. మేలు రకం పని ముట్లు కూడా క్రమంగా ప్రవేశ పెడుతున్నారు.

చేతి వృత్తుల వారికి కూడా యిటీవల వచ్చిన నూతన వ్యవసాయ పరికరాలను తయారు చేయవలసిందని నచ్చజెప్పడం జరిగింది. వారు ఆ విధానాలను అనుసరిస్తున్నారు కూడా. వరి ధాన్యం మొదలగు వాటికి పనికి వచ్చే కొత్త కొత్త రకాల పనిముట్లు తయారవుతున్నాయి. వీటి వెల మామూలుగా పెద్ద పెద్ద కంపెనీలు సప్లయి చేసే వెలలో సగం వుంటుంది,

## పశుపోషణ

కృత్రిమ పశుగర్భోత్పత్తి కేంద్రాల స్థాపన, ఆబోతుల సప్లయి, మేలు రకం జాతులను సప్లయి చేసి స్థానిక కోళ్ళ జాతుల అభివృద్ధి, పశువులకు చికిత్స, వాటి సంరక్షణ చర్యలు మొదలగునవి యీ ప్రాజెక్టు నిర్వహించే పశుపోషణ కార్యక్రమంలో ముఖ్యాంశాలు. కోళ్ళ పెంపకం కేంద్ర మొకటి ప్రారంభించబడి, వివిధ గ్రామాలకు మేలు రకం జాతి పక్షులు ఒక వంద సబ్సిడీ పద్ధతిపై సప్లయి చేయబడినవి. కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రము, మేలు

రకం పశువుల సప్లయి మొదలగు విషయాలలో తగు చర్యలు గైకొనబడుతున్నవి.

## విద్య

హెడ్ క్వార్టర్స్‌లో గిరిజన బాలురకు ఒక హాస్టలు ఏర్పాటు, గ్రామాలలో ఇంకా అనేక పాఠశాలల ప్రారంభం, పాఠశాలలను బేసిక్ పద్ధతి లోనికి మార్చుట, విద్యా బోధన పరికరాల ఏర్పాటు, క్రీడా సామగ్రి, బీద విద్యార్థులకు పుస్తకాలు, పలకలు, బలపాలు, దుస్తులు, సూత్ర యజ్ఞశాలలు మొదలగు వాటిని ఏర్పాటు చేయటం, విద్యా కార్యక్రమంలో ప్రధానాంశాలు. 37 మంది సభ్యులతో 1957 నవంబరు 14వ తేదీన గిరిజన హాస్టలు ప్రారంభించబడింది. ప్రస్తుతం యిది అద్దె భవనంలో వుంది. 15 వేల రూపాయల ఖర్చుతో క్రొత్త భవన నిర్మాణం కొనసాగుతున్నది. రెండు గ్రామాలలో సూత్ర యజ్ఞశాలలు నిర్మాణంలో వున్నాయి. కార్యక్రమాన్ని అనుసరించి 5 పాఠశాలలు బేసిక్ పాఠశాలలుగా మార్చబడినవి. యీ సంవత్సరం యింకా 20 పాఠశాలలు కొత్తగా తెరవాలని సంకల్పం. గ్రామస్తులే పాఠశాలలకు పూరిండ్లు యిచ్చారు. కొన్ని సందర్భాలలో అవసరమైన ఫర్నిచరు కూడా యిచ్చారు. 1958 జనవరి చివరకు 11 పాఠశాలలలో బోధన ప్రారంభమైంది. సకాలంలో ఉపాధ్యాయులను నియమించటానికి వీలు కలుగక మిగిలిన పాఠశాలలు ప్రారంభం కాలేదు. 10 పాఠశాలలకు అవసరమైన విద్యాబోధన పరికరాలు క్రీడా పరికరాలు సప్లయి చేయటం జరిగింది. మరికొన్నిటి సప్లయి జరుగుతున్నది.

వయోజన విద్యా తరగతులు ప్రారంభించారు. కమ్యూనిటీ విశ్రాంతి కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. విశ్రాంతి కేంద్రాలు స్థాపనలో గ్రామస్థులు బాగా శ్రద్ధ తీసుకొంటున్నారు. గ్రామ సేవకుల శిక్షణ శిబిరాలు నిర్వహించి వందల మందికి శిక్షణ యిచ్చారు. పిల్లల పార్కులు మూడు నిర్మించబడినవి. పిల్లలు ఆసక్తితో అక్కడికి వచ్చి ఆట పాటలతో ఆనందంగా ప్రొద్దుపుచ్చుకుంటారు,

గిరిజనుల సాంస్కృతిక కార్యక్రమాల్లో ధండారీ నృత్యం ప్రసిద్ధమైనది. ఈ నృత్యం సామాన్యంగా పురుషులే చేస్తారు. నృత్యం చేసేవారు సామాన్యంగా సరిసంఖ్యలో వుంటారు. ఒక్కొక్కసారి 48 మంది వరకు నృత్యంలో పాల్గొనవచ్చు. అందరూ కలసి వలయాకారంగా ఏర్పడి గంటల తరబడి నృత్యం చేస్తారు. లయబద్ధంగా కర్ర దెబ్బలతో, మద్దెల మోతకు అనుగుణంగా నృత్యం మనోహరంగా సాగుతుంది. అడుగులు మెల్లిగా మృదువుగా వేస్తారు. ప్రతి నృత్యంలో ఇద్దరు లేక ముగ్గురు ''గుసారి''పాత్ర వహిస్తారు. వీరి పని నృత్యవలయం సక్రమంగా వుండేటట్లు చూడటం, పాల్గొంటున్న వారిని హుషారు చేయటం. వీరు సామాన్యంగా గ్రామంలోని ముఖ్య పెద్దలై వుంటారు. నృత్యం చేసే వారితో పాటు వలయం చుట్టూ వీరు కూడా తిరుగుతూ నృత్యం చేస్తుంటారు. అయితే నృత్యం వలయం తిరుగుతున్న వైపుకు వ్యతిరేకంగా వీరు తిరుగుతుంటారు. వీరు నెమిలి యీకలతో అలంకరించిన టోపీలు, యితర అలంకారాలు చేసుకుని నృత్యం చేస్తారు. అలాగే మెడలో గాజు ముక్కలు, చిన్న చిన్న ఉంగరాలు, పూసల దారాలు కూడా అలంకరించబడి వుంటాయి. చిరుగంటలు. గవ్వలు కూడా మెడలో అలంకరిస్తారు. వలయంలో నృత్యం చేసే వారి దుస్తులు మాత్రం మామూలుగానే వుంటాయి. ఒక్కొక్కప్పుడు గిరిజన స్త్రీలు కూడా ధండారీ నృత్యం చేస్తారు. కాని నృత్య బృందంలో గుసారీలు మినహా పురుషులెవ్వరూ వుండరు.

కమ్యూనిటీ కేంద్రాలలో ఏర్పాటు చేసిన ఆటపాటలలో గిరిజన యువకులు ఉత్సాహంతో పాల్గొంటారు. గ్రామాలలో మామూలుగా ఆడే ఆటలకు తోడు ''వాలీబాల్'' వారిని ఎక్కువ ఆకర్షించింది.

ఖేస్లాపురం అనే గిరిజన గ్రామం ఏటేటా జరిగే తిరుణాలకు ప్రసిద్ధి. నాగోబా దేవాలయంలో పూజల సమయంలో యీ మేళా జరుగుతుంది. ఉట్నూరు నుండి, యింకా దూర ప్రదేశాల నుండి గిరిజన యాత్రికులు వచ్చి ఉత్సవంలో పాల్గొంటారు. నాల్గు రోజుల పాటు జరిగే యీ వుత్సవంలో సుమారు పదివేలు, యిరవై వేల మంది పాల్గొంటారు. హైమన్‌డార్ఫ్ కాలంలో యీ జాతర చాలా ప్రసిద్ధి పొందింది. చర్చలు చేయటానికీ, నిర్ణయాలు తీసుకోటానికీ ఆయన యీ సమయాన్ని వినియోగించుకొని జాతర కాలంలోనే జిల్లా అధికారుల సమావేశాలు ఏర్పాటు చేసే వాడు. సంప్రదాయంగా వచ్చే దర్బారు హాలు సభలు ఇంకా జరుగుతూనే వున్నాయి. ఈ సమావేశాల్లో గిరిజనులకు పట్టాలు

యిస్తారు. జిల్లాలో జరిగిన సాంఘిక సేవా శాఖ కార్యక్రమ నివేదికలు కూడా యీ సభలో సమర్పిస్తారు. గిరిజనులు, యితరులు విశేషంగా సమావేశమయ్యే అవకాశంగా యీ జాతరకు చాలా ప్రాధాన్యం వచ్చింది. జిల్లాలోని వివిధ శాఖల కార్యక్రమాలు తెలిపే ప్రదర్శనాలు జాతర జరిగే చోట ఏర్పాటు చేస్తారు. గిరిజనులు నిర్వహించే నృత్యాలు, నాటకాలు, సంగీత సమ్మేళనాలు, బడి పిల్లల, యువజనుల, ఆటల పోటీలు, శిశు పశు, ప్రదర్శనలు, విజ్ఞాన దాయకమైన సినిమా ప్రదర్శనలు మొదలగు కార్యక్రమాలు జాతర సమయంలో ఏర్పాటు చేస్తారు. బహుమతులు దర్బారు హాలు సభలో పంచిపెడతారు. వివిధ గ్రామాల నుండి వచ్చి పోటీలలో పాల్గొన్న వారికి యీ కార్యక్రమం ఉత్సాహ జనకంగా వుంటుంది. పోయిన దఫా జరిగిన జాతరలో హాస్టలు పిల్లలు చేసిన డ్రిల్లు అనేకులను ఆకర్షించింది.

## ఆరోగ్యం, పారిశుద్ధ్యం

ఈ ప్రాజెక్టులో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము, 5 ఉప కేంద్రాలు ఏర్పాటు చేయాలని సంకల్పం. యింత వరకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రము, 3 ఉప కేంద్రాలు ఏర్పాటైనవి. మంచి నీటి బావులు ఎక్కువగా తాలూకా లోపలి భాగం గ్రామాలలో అవసరం. 20 బావుల త్రవ్వకం పని జరుగుతున్నది. ప్రాజెక్టు పని చేసే కాలంలో 100 కు పైగా బావులు త్రవ్వుతారు. 1216 సోకేజి గుంటలు, 120 పొగలేని పొయ్యిలు ఏర్పాటు చేయబడినవి. బావులలో మందుకలపటం మామూలుగా ఎప్పుడు జరుగుతూనే వుంటుంది. మంచి నీటి బావుల నిర్మాణంలో గ్రామస్థులు శ్రమరూపంలో సహాయం చేస్తుంటారు.

## సేద్యపు నీటి పారుదల

బావి నీటితో సేద్యం చేసే పద్ధతి గ్రామాల్లో ప్రవేశ పెట్టాలని సంకల్పం. ఆ అవకాశం వుంటే గ్రామస్థులు తోటలు వేసుకోవచ్చు. ప్రస్తుతం గిరిజనులు మెట్ట పంటలు మాత్రమే పండిస్తున్నారు. అందువల్ల గ్రామాల్లో కూరగాయలు వుండవు. పోనీ దూర ప్రదేశాల నుండి అయినా యిక్కడికి రావు. సేద్యపు నీటితో సాగుపై గిరిజనులకు అంతగా శ్రద్ధలేనట్లు కన్పిస్తుంది. అందువల్ల సేద్యపు బావుల కోసం అప్పులు తీసుకోటానికి అంతగా ముందుకు రారు. ఈ పద్ధతి నీటి సాగు విషయంలో వారిని సుముఖులుగా చేయటానికి ప్రత్యేక ప్రయత్నం జరగాలి. అప్పులు తీసుకునే విషయంలో నచ్చచెప్పాలి. లోపలి భాగంలోని గ్రామాల పొలాల విషయంలో మరొక చిక్కు వచ్చింది. వాటికి మార్కెట్‌లో మంచి ధర లేదు. అందువల్ల విలువ నిర్ణయించటంలో చాలా తక్కువ మొత్తం వచ్చి, చాలినంత ఋణం లభించదు. ఈ ప్రాంతాలలో భూసార పరిశీలన జరుగవలసిన అవసరం కూడా వుంది. యిందుకోసం ముందుగా సర్వే జరిపించాలి. సాంకేతిక ఉద్యోగుల కొరత వల్ల యీ కార్యక్రమం యింకా ప్రారంభం కాలేదు.

## రహదార్లు

ప్రాజెక్టుకు కేటాయించిన కొద్దిపాటి నిధులతో ఇక్కడి అనేక గ్రామాలకు రోడ్లు నిర్మించవలసి వస్తున్నది. ఎందుకంటే యిక్కడి నేల నల్లరేగడి కావటంతో కచ్చా రోడ్లు నిర్మించినా లాభం లేదు. అన్నింటి కంటే ప్రధానమైన సమస్య యీ గ్రామీణ ప్రాంతాన్ని యితర ప్రాంతాలతో ఏవిధంగా కలపాలనేదే. తాలూకాలో చాలా కొద్ది భాగంలో మాత్రమే యిప్పుడున్న రోడ్డు పోతున్నది. యిది పశ్చిమ దిశ నుండి తాలూకాలో ప్రవేశిస్తుంది. యిటీవల పబ్లిక్ శాఖ కార్యక్రమంలో ఉట్నూరు – ఆసిఫాబాద్ రోడ్డు నిర్మాణం చేర్చబడింది. దీనివల్ల తాలూకా తూర్పు భాగానికి ఉపయోగం. పోతే ప్రాజెక్టు కార్యక్రమంలో మైలుకు 12 వేల రూపాయిల ఖర్చుతో 30 మైళ్ల పొడవున మెరం రోడ్డు నిర్మించాలని సంకల్పించబడింది. యిది ఉత్తర భాగానికి, ఆగ్నేయ ప్రాంతానికి ప్రయోజనకారి. రోడ్డును గ్రామాలనూ కలిపే చిన్న రోడ్లు సుమారు 3 మైళ్ల మేర నిర్మించబడుతవి. రోడ్డు కార్యక్రమం పూర్తి అయితే, తాలూకాలో రహదారీ సౌకర్యాలు విరివిగా ఏర్పడి, మారు మూల గ్రామాలకు కూడా తాలూకా ముఖ్య పట్టణంతోనూ, యితర ప్రదేశాలతోనూ సంబంధ మేర్పడుతుంది. అప్పుడు సంవత్సరం పొడుగునా రాకపోకలు సాగించుకోవచ్చు. ఒక మైలు పొడవున రెండు చిన్న రోడ్ల నిర్మాణం ప్రారంభమైంది.

కళలు, చేతి వృత్తులు:- ప్రాజెక్టు కార్యక్రమాల క్రింద త్వరలోనే కళలు, చేతివృత్తుల పథకాల అమలు ప్రారంభమవుతుంది. వడ్రంగం, కమ్మరం, కుమ్మరం, నేత,

తోలు వస్తువుల నిర్మాణాలలో అభ్యర్థులకు శిక్షణ యివ్వటానికి ఉట్నూరులో ఒక కేంద్రం ప్రారంభింప బడుతుంది. తేనె టీగల పరిశ్రమను స్థాపించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. యిందులో నిపుణులైన వారు పరిశీలనలు జరిపారు. గిరిజనులకు అదనపు ఆదాయ మార్గాలను కల్పించే ఉద్దేశంతో గిరిజనస్త్రీలకు అడ్డ ఆకులతో కప్పులు వగైరా తయారు చేయటానికి అవసరమైన శిక్షణ యివ్వ బడుతుంది. గ్రామాలలో తిరిగి ఒక శిక్షకురాలు యీ పద్ధతులు నేర్పుతుంది.

మహిళా సంక్షేమం:- రెండు చోట్ల మహిళా మండలులు పని చేస్తున్నాయి. కుట్టుపని, అల్లిక పనుల్లో యిక్కడి మహిళలు శ్రద్ధ తీసుకుని నేర్చుకుంటున్నారు. వీటికి ఇంకా ఆటలకూ అవసరమైన పరికరాలను ప్రాజెక్టు సప్లయి చేస్తున్నది. ఉట్నూరు మహిళా మండలిలో స్త్రీలకు వయోజన తరగతి కూడా ప్రారంభమైంది. యితర గిరిజన గ్రామాల్లో కూడా మహిళా మండలుల స్థాపనకు కృషి జరుగుతున్నది.

సహకారోద్యమం:- ప్రాజెక్టు నిర్వహించదలచిన సహకార కార్యక్రమాల్లో గిరిజనులకు రెండు ప్రాథమిక సహకార మార్కెటింగ్ సంఘాల స్థాపన ఒకటి. గిరిజనులు సేకరించే అటవీ వస్తువులు, యితర వస్తువులఅమ్మకాలకు యీ సంఘాలు ఉపయోగపడుతవి. ప్రజలకు అందుబాటులో ఆయా చోట్ల సంఘాల ప్రధాన గిడ్డంగులు, బ్రాంచి గిడ్డంగులు ఏర్పాటు చేయబడుతవి, యిప్పటికే యీ ప్రాంతంలో ఒక బహూళార్ధ సాధక సంఘం, రెండు గ్రామీణ బ్యాంకులు, 7 పరపతి సంఘాలు ఏర్పడి పనిచేస్తున్నవి. ఈ సంఘాల కార్యక్రమం 136 గ్రామాలకు, 1979 కుటుంబాలకు వ్యాపించింది. ప్రాజెక్టు పని చేయటం ప్రారంభమైన తర్వాత ఒక వ్యవసాయ పరపతి సంఘం, ధాన్యం బ్యాంకులు, పరపతి సంఘాలవంటి 6 సంస్థలు పునరుద్ధరించబడినవి. 302 మంది సభ్యులు కొత్తగా చేరారు. రు. 13,100 లు అప్పుగా మంజూరు చేయబడింది. యింత వరకు 2155 కుటుంబాలు సహకారోద్యమ పరిధిలోకి వచ్చాయి. ఈ కార్యక్రమంలో లక్ష్యం 40 శాతం కుటుంబాలను యీ రంగంలోనికి ఆకర్షించాలని. అంటే యింకా 1245 కుటుంబాలను చేర్చాలి. ప్రాథమిక సహకార మార్కెటింగ్ సంఘం ఏర్పాటైతే, యీ లక్ష్యం అధిగమించటానికి కూడా అవకాశం వుంటుంది.

క్రొత్త నాయకత్వం:- గిరిజనులలోని అజ్ఞానం, వినయ విధేయతలు, నిరాడంబరత్వం అనేక సందర్భాలలో కార్యక్రమాలకు అడ్డు వస్తుంటుంది. ఒక గ్రామానికి ఒక మంచి నీటి బావి మంజూరైంది. గిరిజనులందరూ యీ వార్త విని చాలా సంతోషించారు. బావి త్రవ్వకం ప్రారంభించారు. దాదాపు పని పూర్తి కావచ్చే సమయంలో ఒక రోజు హఠాత్తుగా పని మానేశారు. ఉద్యోగులు వెళ్ళి పని సాగించాలని కోరితే వారు తమకు బావి అక్కర లేదంటారు. కారణా లేవో చెప్పరు. ఉద్యోగులు గుచ్చి గుచ్చి అడిగితే వాళ్ళు ఏమని చెప్పారంటే, ఎవరో దారిన పోతూ ఒక వ్యక్తి బావి త్రవ్వటానికి లైసెన్సు కావాలనీ, బావి నిర్మాణపు ఖర్చు తమ వద్ద నుండి తక్కావి ఋణాల రూపంలో వసూలు చేస్తారని చెప్పాడట. ఇదంతా ఉచితంగా జరిగే కార్యక్రమ మేననీ, డబ్బు మళ్ళీ వసూలు చేయరనీ, లైసెన్సు అక్కర లేదనీ, వారికి నచ్చజెప్పే సరికి తల ప్రాణం తోకకు వచ్చింది. యిదంతా విని అతి కష్టం మీద తమ అభిప్రాయాలు మార్చుకుని మళ్ళీ వారు పని ప్రారంభించారు.

ఒక గిరిజన గ్రామంలో గ్రామ నాయకుల శిక్షణ శిబిరం నడుస్తున్నది. సమీప గ్రామంలో ఒక చిరుతపులి ఒక స్త్రీని చంపిందనే వార్త వచ్చింది రాత్రి పూట. ఆ ప్రాంతంలో క్రూర జంతువుల సంచారం వున్నట్లు ఎవరికీ తెలీదు. గ్రామ నాయకులు మామూలుగా గుడారాల్లో పడుకుంటారు గనుక ఆ రాత్రికి కొన్ని జాగ్రత్తలు తీసుకోవలసి వచ్చింది. ఈ గ్రామం అడవికి దగ్గరలోనే వుంది. అందు వల్ల వారికి స్థానికుల గుడిశెల్లో వసతి ఏర్పాటు చేశారు. కొంత సేపటికి తెలిసింది. కొందరు నాయకులు శిబిరంలోనే పడుకుంటామని పట్టు పట్టారట. తమ దగ్గర మంత్ర తంత్రాలు వున్నాయి గనుక తమను ఏ క్రూర జంతువూ ఏమీ చేయలేదని వారి విశ్వాసం. వాళ్ళకు మళ్ళీ ఎంతగానో నచ్చజెప్పి స్థానికుల యిండ్లకు పంపవలసి వచ్చింది. మరునాడు వచ్చిన వార్త ప్రకారం, ఆ స్త్రీని చిరుతపులి చంపలేదనీ, ఏదో జంతువు పొడిచిందనీ.

ప్రజల సహకారం:- ప్రారంభంలో గ్రామాలలో నాయకత్వ లక్షణాలు గల వ్యక్తులెవరో కొంచెం జాగ్రత్తగా పరిశీలించి చూసుకోవాలి. ఈ పరిశీలనలో యింతకు పూర్వం పేరు లేని వారిని కూడా కలుసుకోవలసి వస్తుంది. గణపతి అనే ఒక హరిజనుడు ఒకసారి వచ్చి,తానూ, మరి కొందరు పేద ప్రజలు పొలంలో చల్లటానికి జొన్న విత్తనాలు కొనలేకుండా వున్నామని చెప్పి సహాయం కోరాడు. వారి విషయం నిజంగా జాలికరంగా వుంది. నిరంతరం అధిక వర్షాల వల్ల వారి పొలాల్లో పంట పాడైపోయింది. మళ్ళీ యింకో పంట పండించుకోవాలి. అందుకని వారికి ప్రాజెక్టు నుండి విత్తనాలు సప్లయి చేసింది. దీనివల్ల అనుకున్న పని జరిగింది. ఈనాడు గణపతి గ్రామంలో చాలా ప్రధానమైన నాయకుడు. స్వయంగా పూనుకొని చేసి యితరులచేత చేయిస్తాడు. గ్రామంలో కంపోస్టు గుంటలు, పొగలేని పొయ్యిలు, మేలురకం పశువులన్నీ ఏర్పాటైనవి. గ్రామ పారిశుధ్యం కోసం తరచుగా శ్రమదానం జరుగుతుంటుంది. గ్రామంలో నీటిసాగు చేయటానికి వాగుకు కట్టకట్టాలనీ, గ్రామాన్ని రోడ్డుతో కలపాలనీ ప్రజలే ప్రతిపాదనలు చేశారు.

తాలూకా లోపలిభాగంలో ఒక్క గ్రామంలో వెంకటరావు అనే యువకుణ్ణి ప్రక్క గ్రామంలో జరిగే అభివృద్ధి కార్యక్రమం బాగా ఆకర్షించింది. ప్రక్క గ్రామం గ్రామ సేవకుని కార్యస్థానం. వీటిని గురించి అతడు తన గ్రామంలో గూడా ప్రచారం చేసి రాత్రి పాఠశాల ఏర్పాటు చేశాడు. దీని హాజరు సంఖ్య 80 వరకు పెరిగింది. ఇందుకోసం వారు ఒక పెట్రోమాక్సు లైటు కొన్నారు. కిరసనాయిలు పాఠశాల పరికరాలకు గూడా తగు ఏర్పాట్లు చేసుకున్నారు. ప్రక్క గ్రామానికి వెళ్లే దారిలో కచ్చా వంతెనలు నిర్మించు కొని గ్రామం నుండి వెళ్లే దారులన్నింటినీబాగుచేసుకున్నారు. యిప్పుడా గ్రామం పరిశుభ్రంగా వుంటుంది. గ్రామంలోని విశ్రాంతి కేంద్రం బాగా పనిచేస్తున్నది. వయోజన విద్యా తరగతులకోసం, అవసరమైన ఫారాలు, పుస్తకాలు, ఛార్టులు మొదలగునవి ప్రాజెక్టు సిబ్బందిని అడిగి తెచ్చుకున్నారు. అలాగే ఆటల సామగ్రి విశ్రాంతి కేంద్రంలో కావలసిన పరికరాలు తెచ్చుకున్నారు.

ప్రాజెక్టు పెట్టిన ఖర్చు రూ. 54,629లు. అన్ని విధాలుగా సేకరించిన ప్రజాసహకారం విలువ రూ. 8637.



విద్య పురుషుల కెంతయవసరమో స్త్రీలకుగూడ నంతయవసరమేయని నా యభిప్రాయము. భరత ఖండము మిక్కిలి యెక్కువ నాగరికతగల దశలో నున్న కాలమున, హిందూ స్త్రీలు విద్యావతులై యుండిరని, మన పురాణాది గ్రంథములు వేనోళ్ల చాటుచున్నవి. వేద మంత్రములు రచించిన వారిలో కొందరు స్త్రీలు గూడ గలరు.

—చిలకమర్తి.

* * * * * *

నా మిత్రునిపై కోపం వస్తే ఆ మాట పైకి చెప్పటంతో నా కోపం చల్లారిపోయింది. కాని శత్రువుపై కోపం వచ్చినప్పుడు మనస్సులోనే పెట్టుకున్నాను. దానితో కోపం హెచ్చిపోయింది.

—విలియం బ్లేక్

# అభ్యుదయ రైతు విజయం

—ఒక పబ్లిసిటీ అసిస్టెంటు.

"ఇంక మేఘాల కెదురు చూడ్డం లేదండీ. ఈ చెఱకు తోటే అందుకు నిదర్శనం. బ్లాకు అభివృద్ధి అధికారి సలహా సహాయాలతో మా చిరకాల కష్టం గట్టెక్కింది" అని విప్పారిన ముఖంతో 45 సంవత్సరాల అభ్యుదయ రైతు శ్రీ ఎస్. రామిరెడ్డి నేను నా మామూలు పర్యటనలో వాళ్ల వూరు వెళ్లినప్పుడు అన్నాడు.

శ్రీ రామిరెడ్డికి సుమారు యిరవయి యెకరాల మెట్ట భూమి వుంది. అది బాగా యెత్తుమీద వుంది. ఆ పొలంలో బావులు త్రవ్వటానికి ప్రయత్నించి విఫలుడయాడు. "ఇందు కోసం వేలు ఖర్చు అయాయి. ఇంకా ఖర్చు చేయటానికి వీలులేని పరిస్థితి యేర్పడింది" అన్నాడు. బ్లాకు అభివృద్ధి అధికారి ప్రస్తుత పథకాన్ని చేపట్టమని తనకు యెలా నచ్చచెప్పాడో, మొదట వినగానే అది ఆచరణ సాధ్యంకాని పెద్ద పథకమని తాను యెలా అనుకున్నాడో అంతా విపరంగా చెప్పాడు. "కాని ఆయన చెప్పిన కారణాలు నచ్చాయి. ఆఖరికి నా వునికికే కారణమయిన యీ సాహస చర్యను తీసుకున్నాను. ఇప్పుడు నేను యెంత ఆనందంగా వున్నానో ప్రభుత్వానికి యెంత కృతజ్ఞుడనై వున్నానో మీరు చూస్తున్నారు!" యిలా చెబుతూ అతను పథకాన్నంతనూ వివరించాడు.

అతని పొలానికి పశ్చిమాన దాదాపు 2 1/2 ఫర్లాంగుల దూరంలో బావులు త్రవ్వితే నీరు లభిస్తుందని తెలిసిందిట. ఆ భూమి కలవారు దానిని సరిగా వుపయోగించుకొనటం లేదు. అందువల్ల యితను లోయలో దాదాపు 50 సెంట్ల భూమిని కొని 12 అ. వ్యాసం, 30 అ. లోతుగల బావిని త్రవ్వాడు. దానిలో యెప్పుడూ జల వూరుతూనే వుంటుందిట. ఈ బావి అతని పొలం కంటె 20 అడుగుల క్రింద వున్నది. 30 అడుగుల రీ.సి. కాలమ్ ఒకటి నిర్మించబడింది. బావిలో నీరు దానిలోనికి ఆయిల్ ఇంజన్, పంపుల సహాయంతో తోడబడుతుంది. ఈ కాలమ్‌నుంచి 2 1/2 ఫర్లాంగుల మేర భూమి అడుగున 4 అం. హ్యూంపైపు వేయబడింది. నీరు దాని గుండా ప్రవహించి అవతల కొసనుగల తొట్టిలో చేరుతుంది. ఆ తొట్టిలోనుంచి కాలువలగుండా పొలం చేరుతుంది. గ్రామస్థాయి కార్యకర్త శ్రీ కె.బి.వి. శాస్త్రి. బ్లాకు అభివృద్ధి అధికారి శ్రీ కె. శివప్ప గారల నిర్విరామమయిన కృషిని చూసి. హ్యూం పైపు వేసే పొలాలుగలవారు తమ పొలాల మధ్యనుంచి దానిని వేయడానికి-తమ భూముల సారం మున్నగువాటికి యిబ్బంది లేకుండా-అంగీకరించారు.

దాదాపు రూ, 10,000 ఖర్చయిన యీ పథకం బాగా జనాదరణ పొందింది. దగ్గిర గ్రామాల నుంచి. దూరం గ్రామాల నుంచి పెక్కు మంది రైతులు వచ్చి చూశారు. వ్యవసాయ రంగంలో నూతన పద్ధతుల ప్రయోజనాలపై వారికి గాఢ నమ్మకం కలిగింది. రామిరెడ్డి ఖర్చు చేసిన రూ. 10,000 లోను రూ. 5,000 బ్లాకు అధారిటీలు మొదట అప్పు యిచ్చారు. పిమ్మట అందులో రూ. 1,250 సబ్సిడీగా పరిగణింపబడినవి. అతను చెప్పిన దానిని బట్టి లాభంతో పోల్చుకున్నప్పుడు ఖర్చయిన డబ్బు లెక్కలోకి రాదు. ఈ భూములకు నీటి పారుదల యిప్పుడే ఆరంభమయింది. అప్పుడే అతనికి చెందిన 7 యెకరాల చెఱకుతోట, 4 యెకరాల రాగి, 3 యెకరాల వేరుసెనగ పొలాలకు లాభం కలిగింది. ఆ పైన చుట్టుపట్ల 20 యెకరాలకు యీ బావినుంచి నీటిపారుదల లభించింది.

సిరికులం, అనంతపురం జిల్లా కొడిగెనహ పంచాయతీ సమితి గ్రామాలలో ఒకటి. ఈ బ్లాకు యెక్కువ బావుల్ని



బావినుంచి తొట్టె, కాలువల ద్వారా పొలానికి వెళ్ళే నీరు

త్రవ్వి, యెక్కువ ఆయిల్ ఇంజన్‌ల యేర్పాటుకి రైతులను ప్రోత్సహించి నీటి పారుదల రంగంలో చాలా చక్కని కృషి సలిపి డిప్యూటీ అభివృద్ధి కమిషనరు శ్రీ కె.బి. లాల్, ఐ.ఎ.ఎస్., ప్రశంసల నందుకొన్నది. ఆయన యీ విధానాన్ని అనుసరించి వ్యవసాయోత్పత్తిని పెంచమని యితర సమితి బ్లాకులకు వ్రాశారు. ప్రస్తుతం యీ బ్లాకు ప్రాంతంలో చాలాపు 1,500 పంట బావులు, 266 ఆయిల్ ఇంజన్లు వున్నాయి.

రామిరెడ్డికి నారుమళ్ల పెంపకం, పచ్చి యెరువులు, రసాయన యెరువుల వాడకాలవంటి ఆధునిక వ్యవసాయ పద్ధతుల గురించి తెలుసు. తమ గ్రామానికి విద్యుచ్ఛక్తి లభిస్తే యింకా బాగుంటుందని, ఖర్చు తగ్గుతుందని అన్నాడు. ఈ ప్రాంతానికి విద్యుచ్ఛక్తి సరఫరా అంచనాలు ప్రభుత్వ పరిశీలనలో వున్నట్లు తెలిసింది. త్వరలోనే వారికి విద్యుచ్ఛక్తిని సరఫరా చేసి ఆధునిక వ్యవసాయ పద్ధతుల అమలుకి రైతులకు ప్రోత్సాహ మివ్వబడుతుందని ఆశించబడుతున్నది.

కథానిక

# క్షమామూర్తులు

—సింగరాజు లింగమూర్తి

"నాన్నా, ఇంక నా గతేమిటి?" అంటూ సరోజ భోరున ఏడ్చింది.

తండ్రి హృదయం ఓ క్షణం, గిజగిజ కొట్టుకుంది.

తల్లి కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

సరోజ వెక్కి-వెక్కి ఏడుస్తున్నది.

మూడేళ్ళ పసివాడు అమాయకంగా సరోజ ముఖంలోకి చూస్తున్నాడు.

"నాన్నా, ఇక ఆయన రారంటావా?" ఆ ఏడుపులోనే తండ్రిని ప్రశ్నించింది సరోజ.

"ఎలా వస్తాడు?" నిర్లిప్తంగా అన్నాడు తండ్రి.

"అవును....ఎలా వస్తారు....రారు. నా ముఖాన్ని ఆయ నింక చూడరు" అని విలపిస్తున్నది సరోజ,

"ఊరుకో తల్లీ—ఊరుకో" అంటూ తల్లి తల నిమురుతూ ఓదారుస్తున్నది.

"అనుభవించు— ఎవరికోసం?" కటువుగా అన్నాడు తండ్రి.

"అదసలే గుండెపగిలి ఏడుస్తుంటే ధైర్యం చెప్పడం పోయి ఏమిటా మాటలు" అంటూ తల్లి భర్తను మంద లించింది.

"అవును....అనుభవించాలి. నలుగురిలో ఆయనను అవమాన పరచి తలెత్తనీయకుండా చేశాను. అందుకు ఆజన్మాంతం నేనిలా కుమిలి పోవాలి" అంటూ సరోజ తల్లి ఒడిలో తల దాచుకుంది. పసివాడు "అమ్మా—అమ్మా" అంటూ సరోజ కొంగు పట్టుకు లాగుతూ ఆమె పాదాల దగ్గర కూలబడ్డాడు. సరోజ తండ్రి విషాదంగా నవ్వు కుంటూ ఆ పసివాడిని భుజాన వేసుకొని అవతలికి వెళ్ళాడు.

బంధు మిత్రాదులతో ప్రొద్దుటినుంచి కళకళ లాడుతున్న ఆ ఇల్లు సాయంత్రాని కల్లా చిన్నబోయింది. ఎంతో సందడిగా ఉండాల్సిన ఇంట్లో స్తబ్ధత తాండవించింది.

సరోజను గూర్చిన ఆలోచనలతో నిద్దరపట్టక తల్లి దం డ్రులు ఎవరి పక్కలమీద వాళ్ళు పొర్లుతున్నారు.

సరోజ తన గదిలో మంచంమీద పడుకొని కిటికీలోంచి వెలుపలికి చూస్తున్నది.

బైట అంతా చీకటి.

ఏ చింతలూ లేని పసివాడు అమ్మమ్మ పక్కలో సుఖంగా నిదురిస్తున్నాడు.

సరోజ తండ్రి మంచంమీద లేచి కూర్చుని చుట్ట ముట్టించాడు.

"ఏం నిద్దర రావడంలా?" అంది భార్య.

"ఎలా వస్తుంది?"

"అమ్మాయి చాలా పొరపాటు చేసింది"

"అది పొరపాటు కాదు— తప్పు .... మహాపరాధం చేసింది."

మళ్ళీ ఇద్దరి మధ్యా మౌనపు తెర దించుకుంది.

"శేఖరం అంతస్తుకు మనం తగని వాళ్ళం తల్లీ అంటే సరోజ వినిందా? మొండిపట్టు పట్టింది. నిజంగా వాళ్ళది ఎంత శ్రోత్రియమైన వంశం. శేఖరం ఎంత బంధుజాలం కలవాడు. తరతరాలుగా వాళ్ళను సేవించి తరించవలసిన తాను సరోజను శేఖరానికి కట్టిపెట్టి అశ్రోత్రియ వంశానికి చిచ్చుపెట్టాడు. అక్కడికీ తాను శేఖరాన్ని కూడా బ్రతి మాలాడు—ఇది ధర్మవిరుద్ధమని-వింటేగా "చుట్ట కొడిగట్ట డంతో విసిరి అవతల పారేసి. రామనాథం మంచం క్రింద

వున్న మరచెంబులోని నీళ్ళతో పుక్కిలించి వుమ్మేసి, దాహం తీర్చుకున్నాడు.

"ఏం నాగరికాలో ఇవి. ఈ చదువులొచ్చి బుద్ధులు మారుస్తున్నాయి గదా. మనుష్యులంతా ఒకటేనట. కులాలమాటే ఎత్తకూడదట. అందుకే ప్రపంచం ఇలా నిప్పు లేకుండానే మండిపోతున్నది. చదువుకున్నదైతే మటుకేం- సరోజ సమానమైన వాణ్ణి చేసుకుంటే ఇప్పుడీ దుఃఖం రాక పోయేదిగా?"అన్న ఆలోచనలు సరోజ తల్లి శాంతమ్మలో మసులుతున్నాయి.

''తన కోసం శేఖరం ఎంత త్యాగం చేశాడు? తనను ఉద్ధరించి, పరమ నిష్ఠాగరిష్ఠులైన తల్లి దండ్రులకుదూరమై, వృద్ధాప్యంలో వాళ్ళ ఆత్మకు శాంతిలేకుండా చేశాడు. అన్న దమ్ములమీద, అక్క-చెల్లెళ్ల మీదవున్న ప్రేమను తనకోసం త్యజించాడు, కాని—తనే- చేసింది? తనవారి ఎదుట అతణ్ణీ, అతని బంధుజాలాన్నీ అనరాని మాటలతో అవ మాన పరచింది."పశ్చాత్తాపంతో సరోజ హృదయం కుత కత లాడింది. దాంతో ఆ రోజు జరిగిన సంఘటనలు, తనను గూర్చి నలుగురూ అనుకున్న మాటలు తలపున కొచ్చాయి.

''ఎంత చదువుకున్నదైతే-నేం.... ఆ బుద్ధి పోనిచ్చింది కాదు.''

''మసిబొగ్గును మాణిక్యం చేస్తే అవుతుందా?"

''అతగాణ్ణి వలలో వేసికొని అతని తల్లి దండ్రులకు దూరం చేసినందుకు వాళ్ళ ఉసురు ఇన్నాళ్లకు తగిలింది.''

"ఇక మిడిసిపాటు తగ్గుతుందిలే— తను మహా ఘన కార్యం చేసినట్టు రొమ్ము విరుచుకు తిరిగేది. ఇక తలెట్లా ఎత్తుతుందో చూస్తాగా."

అమ్మలక్కల మాటలు సరోజ చెవుల్లో గింగురుమంటు న్నాయి.

''తనకో ఇంత అహంభావం ఎలా వచ్చింది? తరతరా లుగా మగ్గిపోతున్న బానిస జాతిలో పుట్టిన తాను శేఖరాన్ని వివాహం చేసుకోవడంతో ఎవరూ చేయని పని తాను చేశా నని అహంభావమా? తనను అణగద్రొక్కిన ఉన్నత వంశీ యులపై యీ వివాహంతో ప్రతీకారం తీర్చుకున్నానన్న గర్వమా?'' ఈ ఆలోచనలు సరోజను ఆవేశ పరుస్తు న్నాయి.

ఆమె అలాగే కిటికీలోంచి బైటకు చూస్తున్నది, ఆకాశంలో అక్కడక్కడ నక్షత్రాలు మిణుకు మిణుకు మంటున్నాయి.

"వెనుకాధారం ఏమీ లేకపోయినా. కూతురూ. అల్లుడూ తమ సంపాదనలోనే ఇల్లు కట్టుకున్నారంటే ఎంతో ఆనంద పడ్డాడు తను. ఈ ముహూర్తబలం బాగాలేదు.-ఇప్పుడు గృహ ప్రవేశం వద్దని సిద్ధాంతిగారు చెప్పినా, సరోజా శేఖరాలకు అవిశ్వాసాల మీద నమ్మకం లేక తొందర పడ్డారు. చివరికీ గృహ ప్రవేశమే ఇద్దరినీ చీలదీసింది కదా"అని రామనాథం తలపోస్తున్నాడు.

'' మీకింకా నిద్దర రానట్టుందే?.... ప్రొద్దున్నే శేఖరం ఎక్కడున్నాడో వెళ్ళి, అయిపోయిందేమో అయిపోయింది సరోజ ఏడుస్తూ కూర్చుందని బ్రతిమాలి తీసుకురండి" అని సలహా యిచ్చింది భార్య.

''అయిపోయింది మరచి పొమ్మని బుజ్జగించడానికి అతనేమైనా చిన్నవాడా. అందులో నీ కూతురు చేసిన నిర్వాకం మరచిపో తగిందా?"

"అలాగని ఊరుకుంటామా?''

ఇంతలో సరోజ అక్కడకు ఉప్పెనలా వచ్చింది.

"నా గురించి మీరేం ఘర్షణ పడనక్కర్లా. ఆయన చేసింది బాగుంది కాని, నేననడం తప్పొచ్చిందేం? ఆయన ఆయన బంధువులూ మనందరినీ అవమానించినట్టు కాదూ? ముందు వాళ్లు భోజనాలు చేశా- మన వాళ్లందరికీ వడ్డిం చడం'' ఆవేశంగా అంటున్నది సరోజ.

రామనాథం ఆశ్చర్యంగా కూతురి వంక చూస్తూ లేచి కూర్చున్నాడు. కూతురి మాటలకు తల్లి తెల్లబోయింది.

"ఇందాకటి నుంచీ శేఖరాన్నీ అతని బంధువుల్నీ అవ మాన పరిచానని పశ్చాత్తాప పడిన సరోజ ఇప్పుడిలా మాట్లాడుతున్నదే"మని తల్లిదండ్రులు ఎవరి మనసుల్లోవారు అనుకుంటున్నారు.

"నాన్నా, నువ్వెళ్ళి ఆయన్నేం బ్రతిమాలి తీసుకు రానక్కర్లా. నా కర్మకు నన్ను ఇట్లా వదిలేయండి'' అంటూ సరోజ విసురుగా గదిలోకి వెళ్ళింది.

* * *

తాము చేసింది తప్పని తెలుసుకొని పశ్చాత్తాప పడినా, తమ ఓటమిని ఒప్పుకోడానికి ఆత్మాభిమానం అడ్డుపడు

తున్నదనుకొనే వారిలో విశాల దృక్పథం లేదనిపిస్తుంది. చిత్త సంస్కారం లేకపోవడం వల్ల, అభిమాన, దురభిమానాలను కల్పించుకొని తమను తాము వంచించుకొనే సరోజ లాంటి స్వభావం కలవాళ్ళు సమాజంలో ఎందరో ఉంటారు, దీనికి పవిత్రమైన కర్మ సిద్ధాంతం ముడిపెట్టి తాము నిమిత్త మాత్రులం అనుకుంటారు.

నిజానికి సరోజ శేఖరానికి ఎంతో కృతజ్ఞురాలై ఉండాల్సింది.

శేఖరం బి. ఏ. ప్యాసై ఉపాధ్యాయ వృత్తిలో చేరాడు. సంస్కరణలన్నా. సాంఘిక సేవన్నా అతనికెంతో అభిమానం. ఉపాధ్యాయ వృత్తిలో ఉంటూనే చేయదగిన సంస్కరణలు. సేవలు చేస్తూ పై చదువులకు పూనుకున్నాడు. ఆ రోజుల్లోనే రామనాథంతో శేఖరానికి పరిచయమైంది.

రామనాథం కులం ఏదైనా గుణం కలవాడు. కుటుంబం పెద్దది కావడం వల్ల, ఆర్థిక స్తోమత అంతగా లేకపోవడం వల్ల. ఆడదానికి ఎక్కువ చదువెందుకన్న ఉద్దేశంతో సరోజను మూడవ ఫారంతోనే ఇంట్లో కూర్చోపెట్టాడు.

''ఈడేరిన పిల్లను ఇంట్లో కూర్చోపెట్టుకుంటే ఎట్లా— త్వరగా ఒకయ్య చేతిలో పెట్టం''డని భార్య పదే పదే రామనాథాన్ని హెచ్చరించింది.

సరోజకు రూప సంపద ఎక్కువగా లేకపోవడమూ, రామనాథానికి కట్నాలు గుమ్మరించే సిరిసంపదలు లేకనూ పెళ్ళికొడుకుల మార్కెటులో తూగలేక పోయాడు.

"తర్డుఫారం వరకూ చదివిన దాన్ని ఊరికే కూర్చోపెట్టడమెందుకూ, ఆంధ్ర మెట్రిక్‌కు కట్టించమని శేఖరం సలహా యిచ్చాడు. శేఖరం సలహా రామనాథానికి నచ్చింది. సరోజ చదవడానికి ఉత్సాహం చూపింది.

''ప్రైవేటు మాస్టర్లను పెట్టి నేను ఫీజులిచ్చుకోలేను'' అన్నాడు రామనాథం.

"పర్వాలేదు - నేనున్నాగా "అన్నాడు శేఖరం.

శేఖరం సరోజకు ప్రయివేటు మాస్టరయ్యాడు.

తన ఉద్యోగ విధులు, సాంఘిక సేవలు నిర్వర్తిస్తూ ఎం. ఏ. కు తాను చదువుతూ సరోజకు పాఠాలు చెబుతూ ఆమెను ఆంధ్రా మెట్రిక్ ప్యాసు చేయించాడు శేఖరం.

"చదువు చూసైనా సరోజను చేసుకుంటానికి ఏ పెళ్ళికుమారుడైనా ముందుకు వస్తాడేమోనని రామనాథం ప్రయత్నించాడు. కాని ఆయన అంచనా తప్పయింది. శేఖరం సలహా ప్రకారం మళ్ళీ సరోజను ''ఇంటర్'' పరీక్షకు కట్టించాడు.

శేఖరం రోజూ వెళ్ళి సరోజకు పాఠాలు చెప్తుండేవాడు.

సరోజలో యౌవనం వెల్లువలై పారింది. ఎక్కువ రూపవతి కాకపోయినా ఆ యౌవనపు తళుకు శేఖరానికి 'జిగేలు' మనిపించేది. అతనిలోగల సంస్కర్త హృదయం ఆమెను పెళ్ళి చేసుకోమని పురికొల్పింది. కాని శేఖరం నిర్ణయానికి రాలేకపోయాడు. ఆమెను ఇంటర్ పూర్తి చేయించి బి. ఏ. కు కట్టించాడు. తను ఎం. ఏ పూర్తి చేశాడు. తన కోరికను సరోజకు తెలిపాడు. ఆమె ఉప్పొంగిపోయింది.

శేఖరం దృఢ సంకల్పంముందు తల్లి దండ్రుల ఆచారాలు, బంధు ప్రేమలు సంకుచితంగానూ, మూఢంగాను కనుపించాయి. తను నమ్మినదాన్ని ఆచరించడమే అతనికి మొదటి నుంచీ అలవాటు. అందుకే సరోజ మెళ్ళో పుస్తె కట్టేశాడు.

అతను అమలుపరచిన సంస్కరణకు శేఖరాన్ని స్నేహితులు పొగిడారు. సంస్కర్తలు అభినందించారు.

తల్లి దండ్రులు దుఃఖించారు. బంధుజాలం విమర్శించింది.

సరోజ హృదయం ఆనందంతో పరవళ్ళు త్రొక్కింది.

కొందరు ఆమె అదృష్టాన్ని పొగిడారు

కొందరు మహాపరాధం చేసిందని తెగనాడారు.

ఎవరుండే హద్దుల్లో వాళ్ళుండాలనీ, ఇలా బరితెగి పోవడం దేశానికే అరిష్టమనీ సనాతనులు దుయ్యబట్టారు.

ఎవరు ఏమనుకున్నప్పటికీ సరోజ శేఖరానికి ఇల్లాలై కూర్చుంది.

భర్త ప్రోత్సాహంతో, తనచదువుకు రాణింపు కలగడాని మరొక బాలికల ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయునిగా చేరింది.

మొదట్లో శేఖరం పట్ల ఏర్పడిన కృతజ్ఞతా భావం స్థానంలో "అహం" తిష్ట వేసింది సరోజలో. అతని బంధువుల యీసడింపులు, ఇరుగు పొరుగు వాళ్ళ ఛీత్కారాలు ఆమెలోని అసూయను ప్రజ్వలింప చేశాయి. ఆమె కుటుంబం

లోనే కాక మొత్తం బంధుజాలంలోనే తనంత చదువు కున్నది లేదన్న గర్వం, శేఖరాన్ని పెండ్లాడి అనూచానంగా వస్తున్న వర్ణ వ్యవస్థలో విప్లవం తెచ్చాననే దర్పం ఆమెలో క్రమంగా జీర్ణించుకుపోయాయి. ఆమెలో కలిగిన మార్పును శేఖరం గుర్తించి ఎప్పటికప్పుడు త్రుంచివేయడానికి ప్రయత్నించాడు, అతను మందలిస్తున్న కొద్దీ ఆమెలో ఆ విపరీత భావాలు మరింత బలపడి పోయాయి.

శేఖరం ఎక్కడికక్కడకు సరిపెట్టుకొని సాంసారిక జీవితం ఆనందప్రదం చేసుకోవాలనుకొన్నాడు. పిత్రార్జితంపై తనకు ఆస్తి హక్కు వున్నా, తను చేసిన అపరాధానికి ఆ హక్కును వదులుకొని స్వశక్తితో తనూ ఆస్తిపరుడు కావాలనీ, తన సంతానం సమాజంలో గౌరవంగా జీవించాలనీ తలచాడు. అలాగని తన తోబుట్టువుల్నీ, తల్లిదండ్రుల్నీ మరచి పోలేకపోయాడు. వాళ్ళ మంచి చెడ్డలకు ఆదుకొనేవాడు. తమను లోకువగా చూసేవాళ్ళను ఆదరించడం దేనికని సరోజ వాదించేది. ఆసూయపడేది.

సరోజ, శేఖరాలు తమ సంపాదనలో కూడబెట్టి, పరపతి సంఘంలో కొంత అప్పు తీసుకొని ఇల్లు కట్టుకున్నారు. దూరదృష్టితో శేఖరం ఇంటిని ఆమె పేరు మీదనే ఉంచాడు. దానితో సరోజలో మరింత అహంభావం ఎక్కువైంది. గృహ ప్రవేశానికి ఇద్దరూ తమ తమ బంధు వర్గాన్ని, మిత్రులనూ ఆహ్వానించారు. శేఖరం తండ్రి ఆ గడప తొక్కనన్నాడు. తల్లి ప్రాణం ఊరుకోక బయలుదేరింది. అతని అన్నలు, వదినలు రాకుండా ఉండలేక పోయారు. శేఖరం ఎంతో ఆనందించాడు. అందరినీ నూతన వస్త్రాలతో సత్కరించాడు. ఇన్నాళ్ళ నుంచీ తమ గడపతొక్కని శేఖరం బంధువులు రావడం, వాళ్ళు సత్కరింపబడటం సరోజ అపార్థం చేసుకుంది.

తనకు నచ్చింది చేశాను కదా అని ఇతరులను కూడా అలా చేయమని చెప్పే స్వభావం కలవాడు కాదు శేఖరం.ఏది మంచో ఏది చెడ్డో నిర్ణయించుకొని ఎవరికి తోచినట్టు వాళ్ళు చేయండని చెప్పేవాడు.ఈశుభ సమయంలో వచ్చిన బంధువులను అవమానపరచాలని కలలో కూడా అనుకోలేదు తన బంధువుల్లో ఆచార వ్యవహారాలను పాటించే నిష్ఠాపరులున్నారు. అందుకు భంగం కలుగకుండా ముందు వాళ్ళకు వడ్డన చేయిస్తున్నారు. ఆ సమయంలో సరోజ అక్కడ లేదు. తన స్నేహితురాలెవరో రాకపోతే ఆమెను తీసుకు రావడానికి వెళ్ళింది. ఆమె తిరిగి వచ్చేటప్పటికి భోజనాలు అవుతున్నాయి. శేఖరం, అతని బంధువులు, తనను తన వారిని అగౌరవపరచినట్టు భావించింది. తన వారెవరూ ఆ భావం వెలిబుచ్చక పోయినా, వాళ్ళకసలు ఆ అభిప్రాయమే కలగక పోయినా. ఆమెలో జీర్ణించుకు పోయిన ద్వేషం, అహంభావం ఆమెను పిచ్చిదాన్ని చేశాయి. తండ్రి వద్దని వారిస్తున్నా వినక భోజనాలు చేస్తున్న వారందరిని నానా మాటలంది. ఆవేశంతో చిందులు త్రొక్కింది. పెద్ద మనుషులుగా మధ్య కల్పించుకుని సర్దుబాటు చేయబోయిన వారిని తూలనాడింది. శేఖరంతో పెంకెగా వాదించింది. సగం భోజనంలోనే శేఖరం బంధువులు చేతులు కడుక్కొన్నారు. దూరపు గ్రామాల నుంచి వచ్చిన వారు అప్పటికప్పుడే ప్రయాణమయ్యారు. శేఖరానికి తల కొట్టేసినట్లయింది. కళ్ళల్లో నీళ్లు నిండాయి. పోతున్న బంధువుల వంక చూస్తూ తల చేత్తో పట్టుకొని అలాగే కొంతసేపు కూలబడ్డాడు.

సరోజ హద్దూ–పద్దూ లేకుండా ఆడిపోస్తున్నది. ఆమె బంధువుల్లోని కొందరు వంతపాడారు. పోతున్న వారిని చూచి పగలబడి నవ్వారు.

సరోజ ఆడిపోతలు శేఖరాన్ని ఉద్విగ్న[illegible]స్తున్నాయి.

ఆమె బంధువుల పకపకలు అతని [illegible] చిల్లులు పరుస్తున్నాయి.

'సరోజా' అని పొలికేక పెట్టాడు.

ఆమె అదరిపడింది.

అతని చూపులు అంతరంతరాళాల్లోకి దూసుకుపోతున్నట్టు బాధపడింది. కాని ఆమెలో తిష్ట వేసుకున్న పిశాచి పగలబడి నవ్వించింది.

శేఖరం తనను తాను శాంతపరచుకున్నాడు. అక్కడి నుంచి లేచి అడుగులో అడుగు వేస్తూ, తిరిగి తిరిగి క్రొత్తగా కట్టుకున్న ఇంటిని, ఇంటి ముందు కుక్కపిల్లతో ఆడుకుంటున్న మూడేళ్ళ పసివాడిని చూస్తూ, నీళ్లు నిండిన కళ్లను చేతి రుమాలతో తుడుచుకుంటూ, వెనుక నుంచి పిలుస్తున్న రామనాథం పిలుపును వినకుండానే ముందుకు వెళ్ళిపోయాడు.

తెల్లవారింది. భర్తకు తనమీద కలిగిన కోపం తగ్గి

ఇంటికి వస్తాడేమోనని సరోజ ఎదురు చూస్తున్నది. యాంత్రికంగా పనులు చేస్తున్నదే కాని మనస్సు పరధ్యానంగా వుంది. మామూలుగా స్కూలువేళకు బయలుదేరింది. నడుస్తుంటే ఎంతో వెలితిగా అనిపించింది. ఎప్పుడూ ఇద్దరూ కలిసే వెళ్లేవారు. ఇప్పుడామె ఒంటరిగా నడుస్తుంటే కొందరు విడ్డూరంగా చూస్తున్నారు. జరిగిన ఉదంతం తెలిసిన వాళ్ళు ఆమెను చూసి నవ్వుకున్నారు. వాళ్ల నవ్వులు గాయపడిన ఆమెహృదయాన్ని గాజు ముక్కతో గీరినట్టు బాధపడుతూ తలెత్తకుండా చకచకా నడుస్తున్నది. ఇంతలో శేఖరం పనిచేసే స్కూలు వచ్చి అనుకోకుండానే ఓ క్షణం నిలబడి పోయింది. రోజూ అక్కడికి రాగానే తను ముసిముసి నవ్వులతో తన సంచీలోంచి టిఫిన్ బాక్సు తీసి అతనికి అందించడం, అతను దానిని అందుకొని చిరునవ్వుతో గేటులోనికి వెళ్ళడం జ్ఞాపకం వచ్చేటప్పటికి అప్రయత్నంగానే కళ్ళు చెమ్మగిల్లినాయి. వెనుక నుంచి ఎవరో పెద్ద పెట్టున నవ్వినట్టుతోచి తిరిగి చూసింది. నిన్నటి సంఘటన చూసిన విద్యార్థులు కాబోలు నవ్వుతున్నారు ''బొత్తుగా పిరికి మొద్దునవ్వుతున్నావేమిటి!'' అనుకుంటూ సరోజ కళ్లు తుడుచుకుని ముందుకు నడిచింది.

ఆ రోజు పాఠాలు కూడా సరిగ్గా చెప్పలేక పోయింది. తోటి ఉపాధ్యాయినులు, పిల్లలుకూడా తనను వెక్కిరిస్తున్నట్టు అనిపించి బాధపడింది. ఎలాగో నాలుగు గంటల వరకూ గడిపి ఇంటికి బయలు దేరింది. శేఖరం స్కూలు సమీపించేటప్పటికి గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. తన కోసం ఎదురుచూస్తూ, తను రాగానే సాదరంగా నవ్వుతూ పలుకరించే శేఖరం అక్కడ లేక పోవడంతో నిలువునా నీరైపోయింది. అందరూ తనను చూసి నవ్వుతారేమోనని రిక్షా మాట్లాడి ఎక్కింది.

ఇంటి దగ్గర రిక్షా దిగేటప్పటికి మూడేళ్ల రాజా తాత ఒడిలోంచి దూకి 'అమ్మా' అంటూ సరోజ కాళ్లు చుట్టివేశాడు. శేఖరం రూపురేఖల్ని పుణికి పుచ్చుకున్న రాజాను చూసేటప్పటికి గుండె తరుక్కుపోయింది. వాడిని ఎత్తుకొని ముద్దాడుతుంటే ఆమెలో ఏ అనుభూతి వల్లనో కళ్ళు చెమర్చాయి. రామనాథం ఇదంతా చూస్తూ నిట్టూర్చాడు. శేఖరాన్ని గూర్చి తండ్రిని ప్రశ్నిద్దామనుకుంది కాని అభిమానంతో ఆ మాటలు మింగేసింది. రామనాథం కూతురి పనికి మాలిన ఆత్మాభిమానాన్ని పసికట్టాడు.

''శేఖరం 15 రోజులు సెలవుపెట్టి, తనకు మనః స్థిమితం లేదనీ, కొన్నాళ్ళు దేశాటన చేసి వస్తాననీ హెడ్ మాస్టరుతో చెప్పి వెళ్ళాడట''అన్నాడు రామనాథం.

సరోజ రాజాను క్రిందికి దించి చరచరా గదిలోకి వెళ్లి మంచంమీద వాలిపోయి దిండ్లల్లో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

''కూతురు చేసిన తప్పిదానికి ఇంతకంటే మరేం శిక్ష కావాలి''అనుకున్నాడు రామనాథం.

* * *

రోజులు, వారాలు, గడచిపోతున్నాయి. మూడు నెలలైంది- శేఖరం జాడ తెలియక. క్రొత్తయిల్లు అచ్చిరాలేదని సరోజ దానికి తాళంపెట్టి వెనుకటి కిరాయి ఇంట్లోనే ఉంటున్నది. ఆమెలోని అహం, ద్వేషం యీ మూడు నెలలలోనూ బాగా దెబ్బతిన్నాయి. శేఖరం కనిపిస్తే అతని ముందు మోకరిల్లి, తనను క్షమించుమని కన్నీళ్లతో అతని పాదాలను అభిషేకిద్దామనుకుంది.

ఆ రోజు మామూలుగా స్కూలునుంచి సరోజ వస్తున్నది. శేఖరం స్కూలు దగ్గరకు వచ్చేటప్పటికి అలవాటు ప్రకారం మామూలుగా తలెత్తి చూసింది. ఎదురుగ్గా శేఖరం సాదరంగా నవ్వుతూ కనిపించేటప్పటికి సరోజ సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అయింది. అతని పాదాల దగ్గర వాలి క్షమించమని ప్రార్థిద్దామనుకుంది. కాని అక్కడి వాతావరణం అందుకు అవకాశం ఇవ్వలేదు. ఆమెలో ఏమూలోవున్న 'అహం' ముందుకు వచ్చింది. ''తనను మూడు నెలలు ఏడిపించిన వ్యక్తి ముందు క్షమించమని ప్రాధేయపడటమా'' అనుకుంటూ ముందుకు నడిచింది సరోజ.

శేఖరం అక్కడే నిలబడి పోయాడు - ఆమెవైపు చూస్తూ.

''శేఖరం మాస్టారికి ట్రాన్సఫర్ అయిందట్రోయ్''అని ముందు నడుస్తున్న ఒక విద్యార్థి రెండవ వాడితో అంటున్నాడు.

''ఇక్కడ ఉండటం ఇష్టంలేక ఆయనే ట్రాన్సఫర్

చేయించుకున్నాడటరా-లెక్కల మాస్టారు అంటుంటే విన్నాను" రెండోవాడు అంటున్నాడు.

వాళ్ల సంభాషణ సరోజ విని అక్కడే నిలబడి వెనక్కి తిరిగి చూసింది, కాస్త దూరంలో శేఖరం మరో ఉపాధ్యాయుడితో కలసి వస్తున్నాడు.

''తను మాట్లాడించ లేదని కోపం వచ్చిందేమో. పోనీ ఆయనే మాట్లాడించ వచ్చుగా. ఆయన జరిగింది మరిచి తన వంక చూసి నవ్వినా ఎందుకు పలుకరించ లేక పోయింది తను?''అని ప్రశ్నించుకుంది. ''ఇంటికి రాకపోతారా''అనుకుంటూ వెళ్లిపోయింది,

శేఖరం వస్తాడేమోనని అతని కిష్టమైన వంటకాలు చేసింది సరోజ. మామూలుగా 8 గంటలకల్లా నిద్దర పోయే రాజాను 'నాన్నగారొస్తా''రని చెప్పి కూర్చో పెట్టింది. అల్లుడికోసం ఎదురు చూస్తూ రామనాథం వీధి అరుగుమీద కూర్చున్నాడు. సరోజ తల్లి లోపలి గుమ్మంలో కూర్చుని వీధిలోకి చూస్తున్నది.

''నాన్న ఇంకెప్పుడొత్తారే"అని పదే పదే అడుగుతూనే నిద్దరపోయాడు రాజా. ఆ రాత్రి ఆ ముగ్గురికీ భోజనం చేయ బుద్ధిపుట్టలా. శేఖరంమీది ఆలోచనలతో వేగించింది సరోజ. ''తమిద్దరికీ సంధానకర్త ఎవరా''అని పదే పదే ప్రశ్నించుకుంది. అందుకు తగిన వారు శేఖరం తండ్రి తప్పితే మరొకరు కనిపించలా. 'కాని తన మామ గారు తన కాపురాన్ని సరిదిద్దుతారా"అని ప్రశ్నించుకుంది.

''ఏమైనా సరే- తను పొద్దుటే నాన్నను తీసుకొని వెళ్ళి మామగారినే బ్రతిమాలుతా" ననుకుంది.

అనుకున్నట్టుగానే మరునాడు కాలకృత్యాలు నిర్వర్తించుకొని సరోజ తండ్రిని తీసికొని ఆ ఊళ్ళోనే ఉంటున్న మామగారింటికి బయలుదేరింది. గుమ్మంలో అడుగు పెట్టగానే లోపలి నుంచి శేఖరం గొంతు వినవచ్చి అక్కడే ఆగిపోయారు.

'అక్కడికీ నిన్న అవకాశం ఇచ్చాను నాన్నా, ఇక ఆమెతో పొత్తు కుదరదు'' అంటున్నాడు శేఖరం.

"పది మందీ నడిచే రోడ్డు మీద అది నీ కాళ్ళ మీద పడి ప్రార్థించలేదంటావు– అంతేనా" అంటున్నాడు తండ్రి.

శేఖరం సమాధానం వినిపించలేదు.

''ఆడదానికి ఆత్మాభిమానం మెండు. అందులో నీ భార్య చదువుకుంది. ఉత్తి ఉద్రేకం మనిషే కాని మనస్సు చాలా మంచిదిలాగుంది. మమ్మల్ని దుఃఖ పెట్టింది కాక దాన్ని కూడా దుఃఖ పెట్టి ఏంబావుకుంటావురా? పైగా నీకో కొడుకు కూడా ఉన్నాడే........వాడి భవిష్యత్తేమిటో ఆలోచించావా?" అని అంటున్న మామగారి మాటలు విని, ''నిజంగా ఆయన ధర్మస్వరూపులు–ఆయనను అపార్థం చేసుకున్న పాపిష్టిదితను'' అనుకుని "మామగారూ"అంటూ చరచరా లోపలికి వెళ్ళి ఆయన పాదాలకు నమస్కరించింది. శేఖరం లేచి నిలుచున్నాడు. 'నాన్నా–నాన్నా' అంటూ రాజా శేఖరానికి చేతులందించాడు. రామనాథం శేఖరం తండ్రికి నమస్కరించి నిలుచున్నాడు.

''ఇంకా చూస్తావేరా, కుర్రాణ్ణి ఎత్తుకోవేం? పాపం, వాడు ఈ మూడు నెలల నుంచి నీకోసం ఎంత కలవరించాడో'' అని తండ్రి గద్దించేప్పటికి శేఖరం రాజాను ఎత్తుకున్నాడు.

''లేమ్మా–లే.........పనికిమాలిన ఆత్మాభిమానాలతో సంసారం నరకం చేసుకోకు. ఎంతైనా నీవు నాకోడలివి. మీ క్షేమం కోరడం కంటే మాకు కావల్సిందేముంది........ రారా తాతా" అంటూ ఆయన శేఖరం దగ్గరి నుంచి రాజాను అందుకున్నాడు. సరోజ భర్త పాదాలకు నమస్కరించి క్షమించమని కోరింది.

''బూచి....బూచి" అంటూ రాజా తాతగారి తెల్లటి గడ్డంలో వ్రేళ్ళు దూర్చి ఆడుతున్నాడు.

''అచ్చం అబ్బాయిపోలికే'' శేఖరం తల్లి రాజాను అందుకుంది.

"వీళ్ళిద్దరినీ మించిన గడుగ్గాయి అవుతాడే వీడు'' అన్నారు ముసలాయన.

"వీళ్ళు ఇంతటి క్షమా మూర్తులా" అనుకున్నారు సరోజ, ఆమె తండ్రి.

# జిల్లాల వార్తలు

## అనంతపురం

తడకలేరు నీటి పనులు:- రాష్ట్రపబ్లిక్‌వర్క్సు శాఖామంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు 20-9-59 న అనంతపురంలో తడకలేరు నీటి పనులను ప్రారంభించారు. ఈ పథకానికి రూ. 8.86 లక్షలు ఖర్చు అయినవి. ఇందు నిమిత్తం ప్రభుత్వంపురపాలక సంఘానికి రూ. 6.38 లక్షలు అప్పు యిచ్చింది. ఈ ఉత్సవానికి శా. స. స. శ్రీ కల్లూరి సుబ్బారావు అధ్యక్షత వహించారు.

హరిజన సంక్షేమం:- గోరంట్ల బ్లాకు కోడూరులో 30-9-59న హరిజన దినోత్సవం జరిగింది. హరిజనులకు సోపుగింజలపొడి, నూనె వగైరా పంచ బడినవి. ఉత్తమంగా వుంచిన గృహాలకు, వుత్తమారోగ్యంగల పిల్లలకు బహుమతులు యివ్వబడినవి. బడిపిల్లలకు ఆటలపోటీలు పెట్టి గెలచినవారికి బహుమతులు యిచ్చారు.

## చిత్తూరు

గ్రామ సహాయకులు:- కార్వేటినగరం మొదటి అంచె బ్లాకు అధ్వర్యాన నిరంజన మాదూతపురంలో 27-9-59 నుంచి 29-9-59 వరకు గ్రామసహాయకుల శిక్షణా శిబిరం జరిగింది. దాదాపు 45 మంది పురుషులకు, అయిదుగురు స్త్రీలకు వివిధ విషయాలలో శిక్షణ యివ్వబడింది.

## గుంటూరు

పిల్లల పార్కు:- రాజుపాలెం మొదటిఅంచె బ్లాకు కోట నేమాలిపురి గ్రామంలో సెప్టెంబరులో పిల్లలపార్కు తెరవబడింది.

## హైదరాబాదు

వ్యవసాయంలో శిక్షణ:- తాండూరు మొదటి అంచె బ్లాకు నావల్గి గ్రామంలో 24-8-59 నుంచి 26-8-59 వరకు వ్యవసాయ వర్గం విషయాలలో ప్రత్యేక గ్రామ సహాయకుల శిక్షణాశిబిరం జరిగింది. దాదాపు 50 మంది శిబిరంలో పాల్గొన్నారు. ఇందులో గ్రామపంచాయతీలు, సహకార సంఘాల సభ్యులు అభ్యుదయ రైతులు కూడా ఉన్నారు.

## ఖమ్మం

రేడియో రూరల్ ఫోరం:- తిర్మలాయపాలెం బ్లాకు తనికెళ్ల గ్రామంలో 23-9-59 న 20 మంది వుత్సాహవంతులైన గ్రామస్థులు రేడియో గ్రామీణ గోష్ఠిని యేర్పాటు చేశారు. దీనికి పంచాయతీ బోర్డు అధ్యక్షుడు అధ్యక్షత వహించారు.

గ్రామ సహాయకులు:- వైరా, పాలేరు బ్లాకులలో వరుసగా తాటిపూడి, కోతార్ గ్రామాలలో 1959 సెప్టెంబరులో వ్యవసాయ వర్గం విషయాలలో రెండు గ్రామ సహాయకుల శిక్షణాశిబిరాలు జరిగాయి.

## కృష్ణా

జాతీయ ప్రణాళిక:- 13-9-59 న తిరువూరులో జాతీయ ప్రణాళికా దినోత్సవం జరుపబడింది.

గ్రామ సహాయకులు:- గూడూరు బ్లాకు హుస్సేన్ పాలెంలో ఆధునిక వ్యవసాయ పద్ధతులు, పశుపోషణ వగైరా పద్ధతులలో శిక్షణకై గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం నడుపబడింది. శిబిరానికి 50 మంది హాజరయ్యారు.

బుట్టాయగూడెం రెండవ అంచె బ్లాకు అధ్వర్యాన బుట్టాయగూడెంలో కూడా యిట్టి శిబిరమే నడుపబడింది.

హరిజనదే:- కంచికచెర్ల బ్లాకు గండేపల్లిలో 30-9-59 న హరిజన దినోత్సవం జరిగింది.

అంబర్ చర్ఖా శిక్షణా కేంద్రాలు:- మోటూరు బ్లాకు ముదినేపల్లిలో స్త్రీలకు ఒక అంబర్ చర్ఖా శిక్షణా కేంద్రం ప్రారంభించబడింది.

గురజలో కూడా అట్టి కేంద్రమే ప్రారంభింపబడింది. అక్కడ 45 మంది స్త్రీలు శిక్షణ పొందుతున్నారు.

అంగలూరులో పంచాయతీవారు పిల్లల కోసం యేర్పర చిన పార్కుకి బ్లాకు నిధుల నుంచి ఆట వస్తువులు సరఫరా చేయబడినవి.

రేడియో రూరల్ ఫోరమ్సు:- కృష్ణా జిల్లా దిగువ గ్రామాలలో రేడియో గ్రామీణ గోష్ఠుల పథకాన్ని అమలు పరచాలని ప్రభుత్వం నిర్ణయించింది.

| | | |
|---|---|---|
| వీరవల్లి | బ్లాకు | తేలప్రోలు |
| గన్నవరం | ,, | నున్న |
| మైలవరం | ,, | కౌలూరు |
| నందిగామ | ,, | నవాబుపేట |
| ముసునూరు | ,, | ముసునూరు |

నిర్ణీత గ్రామాలలో గ్రామ పంచాయతీలు యేర్పాటు చేసే యీ గోష్ఠులు శ్రవణ-చర్చా-చర్య వర్గాలుగా పనిచేయటానికి వుద్దేశించబడినవి. ఆలిండియా రేడియో ప్రసారం చేసే ప్రత్యేక కార్య క్రమాలను వినటానికి గోష్ఠి సభ్యులు వారాని కొకసారి సమావేశమవుతారు.

## మహబూబ్‌నగరం

గ్రామదానం:- అఖిల భారత శాంతిసేన కన్వీనరు శ్రీమతి ఆశాదేవీ ఆర్యనాయకం 18-9-59 న బాదేపల్లిలో సర్వోదయ సంఘాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంలో జిల్లా కలక్టర్ శ్రీ బి వెంకటరత్నం. ఐ.ఎ.ఎస్., శ్రీ ప్రభాకర్‌జీ. శ్రీ కొత్త కేశవులు, శ్రీ సూరాభాయ్ శర్మ గారలు ప్రసంగించారు.

శ్రీమతి ఆశాదేవి భూతపుర గ్రామ శివారు పైలట్ ప్రాజెక్టు గ్రామము అయిన నర్సింగపురాన్ని దర్శించారు.

పంచాయతీ సమావేశం:- మహబూబ్‌నగరం జిల్లాలో మొదటిసారిగా 22-9-59 న కల్వకుర్తిలో తాలూకా పంచాయతీల సమావేశం జరిగింది. పంచాయతీ బోర్డు కన్వీనరు శ్రీ జనార్దనరెడ్డి యీ సమావేశానికి అధ్యక్షత వహించారు. గ్రామ పంచాయతీల అధ్యక్ష ఉపాధ్యక్షుల నుద్దేశించి శ్రీమతి శాంతాబాయి ప్రసంగించారు.

కార్యాలయ భవనం:- కొందుర్గలో బ్లాకు కార్యాలయ భవనం జిల్లా కలక్టరుచే తెరువబడింది.

సైన్సుక్లబ్బు:- మహబూబ్‌నగరం ప్రభుత్వ బహుళార్థ సాధక ఉన్నత పాఠశాల సైన్సు క్లబ్బు కాలేజీ రీడరు శ్రీ వేదాంతాచారిచే ప్రారంభించబడింది. ప్రారంభోత్సవానికి శా.స.స. శ్రీ ఏగూరు చిన్నప్ప, యితర అధికార అనధికారులు హాజరయ్యారు.

ఉచిత మధ్యాహ్న భోజనం:- జిల్లా విద్యాధికారి శ్రీ సి. సోమసుందరం బిజ్నేపల్లి ప్రాథమిక పాఠశాలలో ఉచిత మధ్యాహ్న భోజనం పద్ధతిని ప్రారంభించారు.

భూరి విరాళం:- ఉప్పేర్ వాస్తవ్యుడు శ్రీ ఫజల్‌బైగ్ గద్వాల మొదటి అంచె బ్లాకు క్రింద ప్రాథమిక ఆరోగ్య కేంద్రం స్థాపనకు రెండు యెకరాల భూమిని విరాళమిచ్చారు.

విత్తనాల కొట్లు:- దిగువ స్థలాలలో 8 విత్తనాల కొట్ల నిర్మాణానికి రూ 71 100 మంజూరు చేయబడినవి.

1. మహబూబ్‌నగరం 2. కొడంగల్ 3. మద్దూరు 4. సాతాపురం 5. రేవళ్ళి 6. వనపర్తి 7. ఐజా 8. అచ్చంపేట.

రైతు సంఘం:- వ్యవసాయ ఋతువులో ఉత్తమ విత్తనాలు వగైరా సంపాదనలో రైతులకు తోడ్పడటానికి అలంపురంలో ఒక రైతు సంఘం యేర్పాటయింది. ఎకరా పంట హెచ్చుదల విషయంలో కూడా యీ సంఘం పనిచేస్తుంది.

విత్తనాల క్షేత్రాలు:- కొందుర్గలో 5 యెకరాల ప్రాథమిక విత్తనాల క్షేత్రం 112 యెకరాల సెకండరీ విత్తనాల క్షేత్రం యేర్పరచబడినవి.

కొందుర్గ హరిజన వాడలో వయోజనులకు రాత్రి పాఠశాల ఆరంభించబడింది. 25 మంది వయోజనులు అక్షరాస్యులు అయారు.

## మెదక్

సంగారెడ్డిలో నీటి చెరువు:- స్థానిక పరిపాలన, కార్మిక శాఖామంత్రి. శ్రీ డి. సంజీవయ్య 18-9-59 న నీటి చెరువుకు శంకు స్థాపన చేశారు.

హరిజన కాలనీ:- స్థానిక పరిపాలన, కార్మిక శాఖా మంత్రి 18-9-59 న సంగారెడ్డిలో 'సంజీవనగర్' ని ప్రారంభించారు. జిల్లా కలక్టరు శ్రీ టి.ఎన్. కపూర్ మంత్రి గారికి స్వాగతం చెప్పారు. ఈ సందర్భంలో శా.ప.స. లు

శ్రీయుతులు పి.వి. రాజేశ్వరరావు, అంతయ్యగారలు ప్రసంగించారు.

పారిశ్రామిక సహకార సంఘం:– రాష్ట్ర హోం శాఖ మంత్రి శ్రీ ఎమ్. నర్సింగరావు 22-9-59 న సదాశివపేటలో భవానీ కమ్మరి పారిశ్రామిక సహకార సంఘాన్ని ప్రారంభించారు.

ఉపాధ్యాయుల శిక్షణాశిబిరం:- హోం శాఖ మంత్రి 22-9-59 న సదాశివపేటలో 'ఓరియెంటేషన్ శిక్షణా శిబిరాన్ని ప్రారంభించారు.

గ్రామీణ సమాచార కేంద్రం:- ఉప అభివృద్ధి కమిషనరు శ్రీ కె.బి. లాల్ 23-9-59 న తొగరపల్లిలో గ్రామీణ సమాచార కేంద్రాన్ని తెరిచారు. తొగరుపల్లి "కుటుంబాని కొక ప్రణాళిక" అమలుకు యెన్నబడిన గ్రామం.

బ్లాకు సమాచార కేంద్రం:- 25-9-59 న జిల్లా కలక్టరు జోగిపేట మొదటి అంచె బ్లాకు సమాచార కేంద్రాన్ని ప్రారంభించారు.

అదే రోజున ఆయన అందోలులో నౌజవాన్‌కిసాన్ క్లబ్బును. ఆటస్థలాన్ని ప్రారంభించారు.

మహిళా మండలి:- శ్రీమతి టి.ఎన్. కపూర్ అందోలులో మహిళా మండలి కార్యాలయాన్ని తెరిచారు.

కుమారి సొసైలీ కపూర్ అందోలు బాలమందిరాన్ని తెరిచారు.

## నల్గొండ

ప్రణాళిక అభివృద్ధి:- 22-9-59 న జరిగిన జిల్లా ప్రణాళికల. అభివృద్ధి సంఘం సమావేశంలో జిల్లా కలక్టరు శ్రీ శ్రావణ్‌కుమార్, ఐ.ఎ.ఎస్., జిల్లాలో ప్రణాళిక అభివృద్ధిని సమీక్షించారు. నీటి పారుదల పనులకు రూ. 6.1 లక్షలు కేటాయించబడినవనీ, అందులో 144 చెరువుల మరమ్మతుపై రూ. 5.25 లక్షలు యిదివరకే ఖర్చు పెట్టబడినవనీ చెప్పారు. రెవెన్యూ శాఖ 231 పంట వనరులను చేపట్టినవనీ, యిందు నిమిత్తం రూ. 1.76 లక్షలు కేటాయించబడినవనీ అన్నారు. దేవరకొండ తాలూకా శివన్నగూడాలో చిన్న పశు వైద్య డిస్పెన్సరీ ప్రారంభింపబడగలదని ఆయన వెల్లడించారు. శా.స.స. శ్రీ దొడ్డా నరసయ్య. శ్రీ కె. పెదవెంకటరామారావు, తదితర వుద్యోగులు చర్చలో పాల్గొన్నారు.

సమాచార కేంద్రం:- రాష్ట్ర శాసన సభ ఉపాధ్యక్షుడు శ్రీ కొండాలక్ష్మణ బాపూజీ నారాయణపురం మొదటి అంచె బ్లాకు సమాచార కేంద్రాన్ని ప్రారంభించారు.

గ్రామ సహాయకుల శిక్షణా కేంద్రాలు:- నక్రేకల్ మొదటి అంచె బ్లాకు రాజ్‌పేట గ్రామంలో ప్రత్యేక వ్యవసాయ గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం జరిగింది. వివిధ సంస్థల నుంచి వచ్చిన 50 మంది గ్రామ సహాయకులకు శిక్షణ యివ్వబడింది.

భువనగిరి పంచాయతీ సమితి బ్లాకు రాఘుపురం గ్రామంలోను, చౌటుప్పల్ మొదటి అంచె బ్లాకులో పిపల్ పహాడ్ గ్రామంలోను కూడా యిట్టి శిబిరాలే జరిగాయి.

పాఠశాలా భవనం:- పెద్దవూర రెండవ అంచె బ్లాకు ఇబ్రాహిం పట్నం గ్రామంలో స్థానికాభివృద్ధి పనుల కార్యక్రమం క్రింద నిర్మింపబడిన పాఠశాలా భవనాన్ని జిల్లా కలక్టరు తెరిచారు.

## నెల్లూరు

తాళ్లూరు-కొత్తపాలెం రోడ్డు:- తాళ్లూరు మొదటి అంచె బ్లాకులో ఒక మైలు పొడుగుగల తాళ్లూరు-కొత్తపాలెం రోడ్డును రాష్ట్ర అసిస్టెంటు అకౌంటెంటు జనరల్ శ్రీ జి. జయరామన్ ప్రారంభించారు.

## శ్రీకాకుళం

శ్రమదానోద్యమం:- గాంధీ జయంతి సందర్భంలో శ్రీకాకుళం గొంతి వీధిలో శ్రమదానోద్యమం జరిగింది. ఇందులో జిల్లా కలక్టరు శ్రీ హషీమాలీఖాన్, ఐ. ఎ.ఎస్., యితర వుద్యోగులు, బడిపిల్లలు పాల్గొన్నారు. సాయంకాలం శా. స. స. శ్రీ ఆర్. ఎల్. ఎన్. దొర అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది. ఈ సభలో శా. మం. స. శ్రీ టి. రాఘవరావు, కేసరి సంపాదకుడు శ్రీ జె. వి. సుబ్బారావు ప్రభృతులు ప్రసంగించారు.

పాఠశాలా భవనం:- షేక్‌మహమ్మదుపురం బ్లాకులో హరిజన గ్రామం పెయ్యాలవాని పేటలో బ్లాకు కార్యక్రమం క్రింద నిర్మించబడిన పాఠశాలా భవనాన్ని శా. స. స. శ్రీ



10-10-59 న వరంగల్లు ఇంజనీరింగు కళాశాలకు ప్రధాని నెహ్రూ శంకుస్థాపన చేశారు

పి. హెచ్. సత్యనారాయణ తెరిచారు. స్థానిక హరిజన నాయకుడు శ్రీ సింహాద్రి పిల్లలకి పలకలు పంచిపెట్టారు. పాఠశాలావరణలో జిల్లాకలక్టరు కొబ్బరిమొక్కలు నాటారు.

## విశాఖపట్నం

అమలు కార్యక్రమం: గ్రామ, బ్లాకు, జిల్లా స్థాయిలలో సమాజాభివృద్ధి కార్యక్రమం సమర్థమయిన అమలులో వుత్పన్నం కాగల సమస్యలను గురించి కేంద్ర సమాజాభివృద్ధి, సహకార శాఖా మంత్రి శ్రీ ఎస్. కె. డే జిల్లా వుద్యోగులతో చర్చలు జరిపారు. జిల్లా ప్రణాళికలు, అభివృద్ధి సంఘం అధికార సభ్యులతో పాటు చర్చలలో రాష్ట్ర విద్యామంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు, జిల్లా కలక్టరు శ్రీ బి జె. నాయుడు, ఉప అభివృద్ధి కమిషనరు శ్రీ పి. వి. రత్నంగారలు కూడా పాల్గొన్నారు.

## వరంగల్లు

గీత పనివారి సహకార సంఘం:- స్థానిక పరిపాలన, కార్మిక శాఖా మంత్రి శ్రీ డి. సంజీవయ్య 17-9-59న వరంగల్లు గీత పనివారి సహకార సంఘం సభ్యులనుద్దేశించి ప్రసంగించారు. సంఘం మాజీ అధ్యక్షులు శ్రీ ఎ. బుచ్చయ్య, శా. స. స., సంఘం అధ్యక్షులు అయిన శ్రీ వెంకట్రాం నరసయ్య, శా. స. స. శ్రీ ఎన్. రామచంద్రా రెడ్డి, రాష్ట్ర శాసన సభ వుపాధ్యక్షుడు శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ సభలో ప్రసంగిస్తూ సహకారం ప్రాముఖ్యాన్ని గురించి నొక్కి చెప్పారు.

శిక్షణా శిబిరం:- వర్ధన్నపేట మొదటి అంచె బ్లాకులో మొట్టమొదటి సారిగా గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం యేర్పాటు చేయబడింది.

## పశ్చిమ గోదావరి

కొయ్యలగూడెం బ్లాకు రామానుజపురంలో వ్యవసాయదారులకు గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం నిర్వహించబడింది. దాదాపు 50 మంది రైతులకు శిక్షణ యివ్వబడింది.

# మాతృభూమి

(ఆంధ్రుల ఆదికవి నన్నయభట్టుకు మాతృభూమిపైఁగల అభిమానమునకు ఆయన ఆంధ్రమహాభారతమున అర్జునుని తీర్థయాత్రా ఘట్టము నిదర్శనము. అర్జునుడు అన్నగారి ఆజ్ఞగొని తీర్థయాత్రలు చేయుచు తెలుఁగు దేశమును చేరును. ఆ సందర్భమున నన్నయ మహాకవి తన కాలము నాటి తెలుఁగు దేశమును మనోహరముగ వర్ణించినాడు.)

సీ. దక్షిణగంగనాఁదద్దయు నొప్పిన
గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెఱఁగగుచున్న శ్రీ
పర్వతంబును జూచియుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచువేంగీదేశ
విభవంబుఁజూచుచు విభుఁడు దక్షి
ణాంబురాశితీరంబున కరిగిదురిత
హారియైన కావేరి మహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరులకభిమ
తార్థదానంబుఁజేసి కృతార్థుఁడగుచు.

(సేకరణ—శ్రీ బత్తుల వెంకటరామిరెడ్డి,
బేతాపల్లి, అనంతపురం జిల్లా.)

# విశేషాలు

ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ 13-10-59 న తిరుపతి దర్శించినప్పుడు అక్కడి కొండల శ్రేణిని, ప్రకృతి దృశ్యాలను వీక్షించి ముగ్ధులయారు. తమ విద్యా సంస్థలను తిరుపతిలో యేర్పాటు చేసిన శ్రీ వేంకటేశ్వరవిశ్వ విద్యాలయం అధికారులను ఆయన అభినందించారు. ఆయన యిలా అన్నారు: "ఇక్కడి కొండలు రమణీయంగా ఉన్నాయి. చుట్టూ పచ్చిక బయళ్లు, నీలి ఆకాశంతో వియ్యమందే బలమయిన కొండగుట్టలు. ఇవన్నీ బలాన్నీ, ఓరిమిని సూచించేవే. మీ నిర్ణయాల సాధన కృషికి దోహదం చేయటానికి మీ కింతకంటే యెక్కువేం కావాలి? ఒక విధంగా నేను పార్వతేయుడుని. పర్వతాలను దర్శించినప్పుడు వాటితో నేను చెలిమి చేస్తాను. పుష్పాలు, జంతువులు వగైరా కూడా నా చెలికాళ్ళే. వీటన్నిటితోటి స్నేహం చేసుకొనటం చాలా సులభం. ఎటొచ్చీ మనుషులతో మైత్రి కలుపుకొనటమే బహుకష్టం.''

*　　*　　*

గ్లాస్గో సైన్సు, టెక్నాలజీ రాయల్ కాలేజీ ప్రొఫెసర్ రాబర్టువైట్ 23-9-59న నాగార్జున సాగర్‌ని దర్శించారు. ఆనకట్ట, కాలువలకి సంబంధించిన బృహన్నిర్మాణం శరవేగంతో సాగుతున్న దృశ్యాన్ని అవలోకించిన యీ ప్రొఫెసర్ యిలా అన్నారు: "ఈ ప్రాజెక్టు ఒక్క భౌతికాకృతిలో బృహత్తర మయినదేకాదు, మహత్తరమయిన భావ వైశాల్యంతో వూహించబడి, కౌశలంతో, ముందు వెనుకల ఆలోచనలతో కూడిన ప్రణాళికతో సమధిక బలోత్సాహాలతో నిర్వహించబడు తున్నది కూడ.'' ఆయన యీ మహా కృషిలో నిర్మాతల విజయాన్ని కాంక్షించారు.

*　　*　　*

## అపూర్వ ఫలం

కృష్ణా జిల్లా కైకలూరు తాలూకా సోమేశ్వరం గ్రామ వాస్తవ్యుడు శ్రీ వి. వెంకటరాజు కొత్తరకం పంపరపనస అంటు పెంచుతున్నారు. అంటువేసి మూడు సంవత్సరాలయింది. ఇప్పటికి అది $1\frac{1}{2}$ గజాల పొడుగున యెదిగింది. 1959 ఫిబ్రవరి నుంచి జూన్ వరకు అది 5 సార్లు పూసి 8 కాయలు కాసింది. పండు పొడుగు 15 అం., వెడల్పు 8 అం. వుంది. ఇంత చిన్న మొక్క అంత పెద్ద కాయ కాయటం ఫలపరిశోధన చరిత్రకు కేవలం కొత్త. (29-9-59 తేదీగల ఆంధ్ర పత్రిక నుంచి.)



జీవితం కొందరనుకునేట్టు దుఃఖభాజనమూ కాదు. యౌవనారోగ్యాలు, ధనం కలుగజేసే భ్రమలోపడి చాలామంది అనుకునేట్టు ఆనంద నిలయమూ కాదు.

—టాల్‌స్టాయ్

# ముఖ్య వార్తలు

21-9-59

కేంద్ర రవాణా, రాకపోకల సౌకర్యాల మంత్రిత్వశాఖ అభివృద్ధి సలహాదారు, జాయంట్ సెక్రటరీ అయిన శ్రీ హెచ్. పి. మత్రానీ అధ్యక్షతన కేంద్ర ప్రభుత్వంచే నియమించబడిన మధ్యతరగతి రేవుల అభివృద్ధి సంఘం నేడు రాష్ట్రంలో రేవుల అభివృద్ధిపై రాష్ట్ర ప్రభుత్వంతో చర్చలు జరిపింది.

ఆంధ్రదేశంలో ప్రొటో టైపుమెషిన్ ఫ్యాక్టరీ యేర్పాటు విషయాన్ని కేంద్ర ప్రభుత్వం సానుభూతితో పరిశీలించగలదని చర్చల సందర్భంలో శ్రీ ఎల్. బి. శాస్త్రి హామీ యిచ్చారు.

22-9-59

గోదావరి వరదల వల్ల తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల్లో కలిగిన నష్టం చిత్తు అంచనాల ప్రకారం మూడు కోట్ల రూపాయల వరకు వుండగలదని వరద ప్రాంతాలలో పర్యటించి వచ్చిన రాష్ట్ర పబ్లిక్ వర్క్సు శాఖా మంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు చెప్పారు.

23-9-59

పనిని ప్రస్తుత వేగంతో కొనసాగించి ప్రాజెక్టును అనుకున్న ప్రకారం 1963-64 నాటికి పూర్తిచేయటానికై కేంద్ర ప్రభుత్వాన్ని మరొక రూ. 14 కోట్లను అడగటానికి నిజాం సాగర్ కంట్రోలు బోర్డు నిర్ణయించింది.

24-9-59

రాష్ట్రంలో పారిశ్రామిక సహకార సంఘాలకు అవసరమయిన నిర్వహణ సిబ్బందిని, పరికరాలు వగైరాలను సమకూర్చాలని పరిశ్రమల శాఖ ఆలోచిస్తున్నదని అధికార ప్రతినిధి ఒకరు చెప్పారు.

25-9-59

హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో పెక్కు పుర సంస్థలు సరిగా నిర్వహింపబడటం లేదని చేసిన ఆరోపణల పరిశీలనకై ప్రభుత్వం, న్యాయశాఖ కార్యదర్శి శ్రీ డి. సూర్యనారాయణస్వామి అధ్యక్షులుగా అయిదుగురు సభ్యులు గల సంఘాన్ని యేర్పాటు చేసింది.

ఇప్పుడు ఆంధ్ర ప్రాంతంలో అమలులో నున్న 1883 భూమి అభివృద్ధి అప్పుల చట్టాన్ని, 1884 వ్యవసాయ ఋణాల చట్టాన్ని తెలంగాణా ప్రాంతానికి కూడా వర్తింప చేయటానికి ప్రభుత్వం నిర్ణయించింది.

26-9-59

ముఖ్యమంత్రి అధ్యక్షులుగా జాతీయ పొదుపు రాష్ట్ర సలహా సంఘం యేర్పరచబడింది. జాతీయ పొదుపు రాష్ట్ర సలహాసంఘం, రాష్ట్ర సలహాబోర్డు, స్త్రీలపొదుపు కాంపైన్‌ల స్థానే యిదొక్కటీ యేర్పరచబడింది.

27-9-59

కడప జిల్లా రాయచోటి సమీపంలో జరిగిన విమాన ప్రమాదంలో ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు శ్రీ డి. ఎస్. రెడ్డి కుమారుడు పైలట్ ఆఫీసరు శ్రీ డి. వి. ఆర్. రెడ్డి మరణించారు. ప్రమాద సమయానికి విమానంలో ఆయనొక్కరే వున్నారు. విమానం మద్రాసు ఆక్సిలరీ వైమానిక దళానికి చెందినది.

28-9-59

ఇక ముందు గోదావరి వరదను అదుపులో పెట్టే చర్యలలో ఒకటిగా గట్లను వెడల్పుచేసి వాటిపై అంచెల వారీగా రోడ్లు నిర్మిస్తే ఆ విధంగా ప్రభుత్వానికి కొంత ఆదాయం కూడా రాగలదని రాష్ట్ర విద్యామంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు అన్నారు.

29-9-59

అద్దె-కొనుగోలు పద్ధతి క్రింద ఆధునిక వ్యవసాయ పరికరాల సరఫరాకి వుద్దేశించబడిన పథకాన్ని ప్రభుత్వం

మంజూరు చేసి 1959-60 లో రైతులకు ఋణాలివ్వడానికై లక్ష రూపాయలను కేటాయించింది.

30-9-59

ఆంధ్రప్రదేశ్‌కు వర్తింపు విషయంలో 1908 ఇండియన్ రిజిస్ట్రేషన్ చట్టాన్ని సవరించే బిల్లు గెజిట్‌లో ప్రకటించబడింది.

1-10-59

ఒక అధికార ప్రతినిధి ప్రకటన ప్రకారం రాష్ట్రంలో 1959 నవంబరు ప్రారంభం నాటికి 234 పంచాయతీ సమితులు యేర్పాటు అవుతాయి. 1959 డిసెంబరు ప్రారంభం నాటికి అన్ని జిల్లాలకు జిల్లా పరిషత్తులు వుంటాయి.

2-10-59

రాష్ట్రమంతటా 90వ గాంధీ జయంతి జరుపబడింది. ఈ సందర్భంలో ప్రార్థనలు జరిగాయి. అంతా కలసి నూలు వడికారు. బహిరంగ సభలు జరిగాయి.

గవర్నరు పదవ క్షయ సీళ్ళ అమ్మకం ఉద్యమాన్ని ఆరంభించారు.

3-10-59

బూర్గం పహాడ్‌ను వరదనుంచి రక్షించటానికై రూ. 4 లక్షల వ్యయంతో గోదావరికి వరద గట్లను నిర్మించాలని ప్రభుత్వం నిర్ణయించినదని పబ్లిక్ వర్కు్స శాఖా మంత్రి చెప్పారు.

4-10-59

చంద్రుని చుట్టూ ప్రదక్షిణం చేయటానికి వుద్దేశించబడిన స్వయం చోదిత అంతర్గ్రహ గోళాన్ని సోవియట్ రష్యా విజయవంతంగా పైకి పంపింది.

5-10-59

కర్నూలు, మహబూబ్ నగరం జిల్లాల్లో ప్రయోగాత్మకంగా జాయంటు కలక్టర్లను నియమించటానికి ప్రభుత్వం నిర్ణయించింది.

నగర ద్వయంలో నిరుద్యోగ పరిస్థితి పరిశీలనకై ప్రభుత్వం ఒక అధికార సంఘాన్ని నిర్మించింది.

6-10-59

ప్రభుత్వ విభాగంలోప్రాగా మెషిన్ టూల్ ఫ్యాక్టరీలో ఆధునిక పనిముట్ల స్థావరాన్ని యేర్పాటు చేసే విషయం ఆలోచనలో వున్నదని వాణిజ్య, పరిశ్రమల కేంద్ర ఉపమంత్రి శ్రీ సతీష్ చంద్ర బొంబాయిలో చెప్పారు. మంత్రిగారు అక్కడ అఖిల భారత ప్లాస్టిక్ తయారీ కర్తల సంఘం ద్వాదశ వార్షిక మహాసభను ప్రారంభిస్తున్నారు.

7-10-59

భూకమతాల గరిష్ఠ పరిమితి నిర్ణయ పథకం అమలు దేశంలో పరిశ్రమాభివృద్ధికి నాంది అని చిన్న పరిశ్రమలపై విశాఖపట్నం జిల్లా గోష్ఠిని ప్రారంభిస్తూ రాష్ట్ర చిన్న పరిశ్రమల శాఖా మంత్రి అన్నారు.

8-10-59

గోదావరి మిగులు జలాలను ఆంధ్రదేశం మద్రాసుకు సంతోషంతో యివ్వగలదని, యిందుకు కేంద్ర, ఆంధ్రప్రదేశ్, మద్రాసు ప్రభుత్వాలు కలసి సమగ్రమయిన పథకాన్ని అమలు జరపాలని రాష్ట్ర ముఖ్యమంత్రి అన్నారు.

9-10-59

కేంద్ర వైజ్ఞానిక పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల మంత్రి ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్ హైదరాబాదులో ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆడిటోరియానికి శంకుస్థాపన చేస్తూ భారతీయ భాషలలో ప్రజా సాహిత్యాన్ని పెంపొందింప జేసి వాటి అభివృద్ధికి విశాలమయిన పునాది వేయడం అవసరమని నొక్కిచెప్పారు.

10-10-59

ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ వరంగల్లు ప్రాంతీయ ఇంజనీరింగు కళాశాలకు శంకుస్థాపన చేశారు. ఇది రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల సమిష్టి సంస్థ.

11-10-59

ప్రధాని మహబూబ్ నగరం జిల్లాలో షాద్‌నగరం పంచాయతీ సమితిని ప్రారంభించారు. ప్రభుత్వ ప్రజాస్వామ్య వికేంద్రీకరణ విధానాన్ని అనుసరించి చేయబడిన రాష్ట్ర పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల చట్టం క్రింద యేర్పడిన మొదటి సమితి యిది.

మహబూబ్ నగరం జిల్లా వనపర్తిలో కృష్ణ దేవరాయ పాలీటెక్నిక్‌ను ప్రధాని సలాంఛనంగా తెరిచారు.

12-10-59

ప్రధాన మంత్రి నాగార్జున కొండవద్ద 102 కోట్ల నాగా

ర్జునసాగర్ ప్రాజెక్టు పనుల్ని, బౌద్ధ అవశేషాలను దర్శించారు.

13-10-59

ప్రధాని చీరాల సహకార నూలు మిల్లు భవనానికి శంకుస్థాపన చేశారు.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరుని ఆరాధించారు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం కొత్త ఇంజనీరింగు కళాశాలకు శంకుస్థాపన చేశారు. ఆయన విశ్వవిద్యాలయ కళాశాల కొత్త సైన్సు బ్లాకును కూడా ప్రారంభించారు. అటుపిమ్మట శ్రీ వేంకటేశ్వర సంగీత నృత్య కళాశాలను ప్రారంభించారు.

14-10-59

ప్రధాని ఆంధ్రలో పర్యటనానంతరం చెన్నపురిలో ఆగినప్పుడు అభిప్రాయాన్ని కోరగా ఆరు సంవత్సరాల క్రిందట యేర్పడిన దాది ఆంధ్ర చక్కని అభివృద్ధిని సాధించినదని ప్రశంసించారు.

15-10-59

విచారణ లేక అసోసియేషన్ గుర్తింపు రద్దు అని ప్రభుత్వం యిచ్చిన నోటీసు అమలుకు నిలుపు చేస్తూ రిట్ జారీ చేయమని నాన్‌గెజిటెడ్ ఉద్యోగుల సంఘం పెట్టుకొన్న దరఖాస్తును రాష్ట్ర హైకోర్టు డివిజనల్ బెంచి త్రోసిపుచ్చింది.

16-10-59

ఇప్పుడు శాసనసభల జాతీయ సెలెక్టు కమిటీ ముందున్న వ్యవసాయ కమతాల గరిష్ఠ పరిమితి బిల్లు, సంకల్పించిన కౌలుదారీ బిల్లులను గురించి రాష్ట్ర రెవెన్యూ మంత్రి ఢిల్లీ ప్లానింగు కమిషన్‌తో చర్చించారు.

17-10-59

హైదరాబాదులో ప్రాగాటూల్స్ ఫ్యాక్టరీ విస్తరణకు రూ. 35 లక్షల వ్యయంపై కేంద్ర ప్రభుత్వం ఒక పథకాన్ని మంజూరు చేసింది.

18-10-59

సోవియట్ అంతర్గ్రహ గోళం భూమినుంచి కనబడని చంద్రుని భాగాన్ని ఛాయా చిత్రం తీసింది.

19-10-59

చిన్న పరిశ్రమల అభివృద్ధికి "పరపతి హామీ పథకాన్ని" ఇండియా రిజర్వు బ్యాంకు ఆమోదించినదనీ, రాష్ట్రంలో కొన్ని జిల్లాలలో ప్రయోగాత్మకంగా అది అమలు పరిచి చూడబడుతుందనీ రాష్ట్ర పరిశ్రమలు, దేవ ధర్మాదాయ శాఖా మంత్రి పత్రికా ప్రతినిధులకు చెప్పారు.

20-10-59

ఎండోమెంటును రిజిస్టరు చేసుకొని జమా ఖర్చుల పుస్తకాలను చూపాలని దేవ ధర్మాదాయాల డైరెక్టరు నైజాం ట్రస్టును అడగటం న్యాయమేనని రాష్ట్ర హైకోర్టు డివిజనల్ బెంచి అభిప్రాయ పడింది.



జీవితంలో రెండు విషాద సంఘటనలు వున్నాయి. ఒకటి కోరిన కోరిక నెరవేరకపోవటం. రెండు నెరవేరటం.

—బెర్నార్డ్‌షా

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | .. | 1,060,41 చదరపు మైళ్ళు |
| జనసంఖ్య | ... | 3 12,60,133 |
| పురుషులు | ... | 1,576,42 912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |
| **సగటు వర్షపాతము:** | | |
| ఆంధ్ర ప్రాంతం | ... | 34 6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 ,, |
| అరణ్య ప్రదేశం | .. | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | .. | 293 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటలక్రింది ప్రదేశం | ... | 2,93 81,000 ఎకరాలు |
| 1958-59 లో నీటి పారుదలను పొందిన ప్రదేశం | ... | 68 లక్షల ఎకరాలు |
| కోళ్ళ సంఖ్య | ... | 42,42,655 |
| 1958-59 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 61 56 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | ... | 15 5 లక్షల గాలన్లు |
| రైలు మార్గాలు | ... | 2,902 మైళ్ళు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్రి రహదార్లు | ... | 2,072 ,, |
| జిల్లా పెద్ద రోడ్లు | ... | 2,527 ,, |
| జిల్లా ఇతర రోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 64 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |
| ద్వితీయ పంచ వర్ష ప్రణాళిక ప్రమాణం | రూ. | 175.37 కోట్లు |
| **1959—60 బడ్జెటు:** | | |
| ఆదాయం ... | రూ. | 71 29 కోట్లు |
| వ్యయం | ... ,, | 71.66 ,, |
| పెట్టుబడి ఖర్చు ... | ... ,, | 28 30 ,, |



ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూజీ 12-10-59వ నాగార్జునసాగర్ కుడికాలువ సొరంగ మార్గాన్ని పరిశీలిస్తున్న దృశ్యం: